Approved for School use Fort St. George Gazette
Page 161 dated 2—6—1936.

# ఆరణ్యక

అనువాదకులు:
వేంకటపార్వతీశ్వరకవులు.



ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,
కాకినాడ.



వెల రు 0-14-0.

# పీఠిక.

ఈగ్రంథము శ్రీయోగీంద్రనాథ చట్టోపాధ్యాయులు వంగభాషయందు రచియించిన మూలగ్రంథము ననుసరించి శ్రీ బి. వేంకటాచార్యులుగారు కర్ణాటకమున వ్రాసియుండిరి. దాని ననుసరించి మే మాంధ్రీకరించితిమి. ఉపన్యాసములందు విశుద్ధములైన గార్హస్థ్యసామాజికోపన్యాసములు వ్రాయుట చాలఁగష్టము. ఇట్టియుపన్యాసలేఖకులు మిగులఁ గొలఁదిగా నున్నారు. వారిలో శ్రీయోగీంద్రనాథచట్టోపాధ్యాయులొకరు. వీరిగ్రంథములు దేశవిదేశములయందు విఖ్యాతి గాంచియున్నవి. ఈగ్రంథ మనేకభావములతో నిండి యాద్యంతము నతిమనోహరమై సుశిక్షాప్రద మైయున్నది. ఇం దడవిలోఁ బెరిగిన "యారణ్యక" మనస్తత్త్వ మతిమనోహరముగఁ బ్రదర్శింపఁబడినది. గ్రంథ మాద్యంతమును జదివినచో దీని ప్రాశస్త్యము చదువరులకే బోధపడఁగలదు.

ఇట్లు,

వేంకటపార్వతీశ్వరకవులు.

Sreepathi Subba Rao.

5

శ్రీరామచంద్ర.

# ఆరణ్యక.

## మొదటి ప్రకరణము.

ప్రకాశచంద్రుఁడు చాల గందరగోళపడుచు విషమ సంకటమునకు లోనయ్యెను. ఆతఁడు రంగపురమునకుఁ బ్రయాణమై పోవుచుండెను. కాని, యాతఁడు రంగపురపుస్టేషనునందు దిగుటకు మాఱుగాఁ బరాకున దానికి వెనుకటిస్టేషనునందే దిగిపోయెను. దానిపేరు శ్యామపురము. అంతలోనే సాయంకాల మయ్యెను. మరల నుదయముననే గాని రాత్రులయందు బండ్లు వచ్చుట లేదు. అందువలనఁ బ్రకాశచంద్రుఁడు రాత్రి యంతయు నాస్టేషనునం దుండవలసివచ్చెను. అతఁడు మధ్యాహ్నమునందే జనులు వచ్చి స్టేషనునందుఁ దనకొఱకుఁ గనుపెట్టుకొని యుండవలయు నని సమాచారము పంపియుండెను. ఆకారణమున వారు తనకొఱకుఁ గనుపెట్టుకొనియుందురని తలంచి తంతిసమాచారము నిచ్చుటకై కార్యాలయమునకుఁ బోయెను. అక్కడకుఁ బోవుసరి కాతఁడు చేరవలసినరంగపుర మాయూరికి మూఁడుకోసులదూరములో నున్న

దని తెలియవచ్చెను; అప్పుడు చేయునది లేక యోచించుచు నూరకుండెను. అట్లు యోచించుచుండఁగా మనస్సునం దొక యాశ యుదయించుటచే నాతఁ డుత్సాహితుఁ డయ్యెను. అతఁ డిఁక స్టేషనున విశేషకాలము గడపక యారాత్రియే రంగపురమునకు బయలుదేఱి పోవలయు నని సంకల్పించుకొని యెను. కాని, బండి, గుఱ్ఱము మొదలగునవి దొరకున ట్లగప డుట లేదు. ఒకవేళ ధైర్యముతోఁ గాలినడకనే పోవుదమని యోచించుకొన్నను వెంట వచ్చుట కెవ్వరుచు దొరకలేదు. ఐనను బోవలయు నని యున్నయాశ యించుకయుఁ దగ్గలేదు. రంగపురమార్గమునుగూర్చిన సమాచార మంతయు నక్కడనే విచారించుకొని యారాత్రి యొక్కఁడే యామార్గమున బయ లుదేఱెను.

తలపైఁ బంచమీచంద్రుఁడు నవ్వుచుండెను. దిగువ వసంతమలయమారుతము మెల్లమెల్లగ వీచుచుండెను. ఆకా శము నిర్మలమై యసంఖ్యములైనవజ్రములచేఁ బొదుగఁ బడిన చంద్రాతపంబువలె నగపడుచుండెను. చంద్రకిరణప్రసారముచేఁ బ్రకాశించుచు వజ్రసదృశములైన లెక్క లేని యిసుకరేణు వులు క్రింద మార్గము నలంకరించియుండెను. అప్పుడు సం ధ్యాకాలము—ఎండవేఁడిమి లేశమాత్రమును లేదు. కొం చెము చలిగానే యుండెను. ప్రకాశచంద్రుఁడు మనస్సునం దలియుత్సాహముచే వేగముగఁ బోవుచుండెను. అంతవేగ

ముగఁ బోవుచున్నవానికి మూఁడుకోసులదూరమునందున్న రంగపురము చేరుట కెంతసేపు కావలయును? రెండుగంటలలోఁ బోవచ్చునని స్థిరపఱచుకొని బయలుదేఱినయాతఁ డెన్నియో సుఖాలోచనములఁ గల్పించుకొనుచుండెను. స్టేషను నుండి కొంచెముదూరము పశ్చిమదిక్కుగాఁ బోయి యక్కడనుండి దక్షిణమునకుఁ దిరుగవలసియుండెను. కాని, ఘటనాక్రమమున నది క్రొత్తమార్గ మగుటచే నాతనికి దిక్కు తెలియలేదు. స్టేషనునుండి వెలుపలికి వచ్చి పశ్చిమదిక్కని భావించుకొనుచు నుత్తరముఖముగా నిలుచుండెను. ఆకారణమున మొదట బయలుదేఱినప్పుడే, పశ్చిమదిక్కుగాఁ బోక యుత్తరముగా వెడలెను. అతఁడు చాలదూరము పోయెను. నడుమ నెవ్వరినైన నడిగినచో విదేశీయుఁడని తెలిసికొందురను సంశయమున నెవ్వరి నడుగలేదు. ఎంతదూరము పోయినను దక్షిణపుదిక్కునకుఁ దిరుగుమార్గమే యగపడలేదు. అప్పుడు మార్గమున నాతని కెవ్వరు నగపడలేదు. సమీపమున మానిసి వసతిగూడ నున్నట్లు పొడకట్టలేదు. ఆతఁడు దారితప్పి వచ్చియుండెను. ఎవ్వరగపడుదురు? ఇంకను గొంచెముదూరము పోయినపిమ్మట నక్కడిమార్గము దక్షిణదిక్కునకుఁ దిరిగినట్లుగఁ గనఁబడెను. ఆమార్గము నిజముగఁ దూర్పుదిక్కునకుఁ బోవునదైయుండెను. దానినే దక్షిణపుదిక్కునకుఁ బోవుమార్గమని బావించుకొని యాతఁ డాదారిని నడువ నారంభించెను.

అది సరియైనమార్గము గాక యప్రశస్తముగా నుండుటచే నాత నికించుక సందేహము కలిగెను. కాని, యప్పు డాతనికి మఱియు పాయములేదు. అప్పటి కప్పుడే మూఁడుకోసులదూరము నడచి వచ్చెను. అది దక్షిణమార్గమని మనస్సునకు నమ్మకము కలిగిన కారణమున దానిని విడిచి మఱియొకమార్గమునఁ బోవుట కాతనికి ధైర్యము చాలకపోయెను.

కొంచె మించుమించుగ నఱకోసుదూరమువఱకు నా తఁడు వేగముగ నడచెను. అయినను రంగపురచిహ్నము లేవియు నగపడలేదు. అతఁడు నడచుచున్నమార్గము క్రమ క్రమముగా నప్రశస్తమగుచుండెను. అప్పు డాతనికి మనస్సున మొదటి కంటెను వేగముగ భయసంచారము కాఁజొచ్చెను. తుదకు ముందేమియు మార్గము లేకుండఁబోయెను. అతఁ డప్పుడే యరణ్యములోఁ బడిపోయెను. ఈసమయమునఁ బాచ మీచంద్రుఁడు మెల్లమెల్లగ నంతర్ధానుఁ డయ్యెను. చూచు చుండఁగనే సమస్తప్రపంచము నంధకారపూరిత మయ్యెను. అరణ్యమధ్యమున ఘోరాంధకారము—ప్రపంచకమునందలి యంధకార మంతయు నచటికిఁ బ్రోగుచేసి మూటగట్టినట్లుగా నుండెను. ప్రకాశచంద్రుఁడు చాల కష్టమునకు లోఁబడియెను. ఏయుత్సాహమున సాహసించి సంపూర్ణాపరిచితమార్గము నందు రాత్రి యొక్కఁడే బయలుదేఱెనో, ఆయుత్సాహము క్రమక్రమముగా నడుగంటి హృదయమునం దాశాశూన్యస్థల

మున భయము ప్రవేశించెను. అతఁడు భూతప్రేతములకు భయపడువాఁడు కాఁడు. అట్టిభయమే యున్నచో నింతరాత్రి వేళ నొంటిగా బయలుదేఱి యుండునా? అడవియందు దొంగలభయ ముండదు. కాని హింస్రజంతువులనుండి తప్పించుకొను టెట్లు? విశేషముగ రంగపురారణ్యమునఁ బులిమొదలగు క్రూరజంతువులభయము కలదని యాతఁడీవఱకు వినియుండెను. అందువలన నొక్కసారిగ నాతఁడు భయముచే నాక్రమింపఁ బడియెను.

ఏమార్గమునుండి వచ్చి యీయడవిలోఁబడియెనో, అంధకారమునం దిప్పు డామార్గము కలసిపోవుటచే నాతనికి దొరకకుండఁబోయెను; ప్రాణభయముచే నస్థిరుఁడై యరణ్యమధ్యమున నేమార్గముదొరకిన నామార్గమునే పట్టి యతికష్టముతోఁ బోవఁజొచ్చెను. ఇష్టమున్నను వేగముగాఁ బోవుట కుపాయములేదు. ఎందువలన ననఁగా—అడుగడుగునకు నాటంకమే—అడుగడుగునకు బాధయే—చెట్లకొమ్మ లొకదానిపై నొకటి పడి క్రిందికి వంగి తలకుఁ దగులుకొనుచుండెను.

ఈయంధకారమయమైన భయంకరారణ్యమునందు భయమున కింతేకారణము కాదు. ఇంతకంటెను విశేషభయకారణములు కలవు. ఆకారణములు మఱేవియనుంగావు. అరణ్యమధ్యమున దూరమునందుఁ బెద్దపులుల పెద్దపెద్దబొబ్బరింతల

శబ్దములు ! ఆనిబిడారణ్యమున, నాఘోరతరాంధకారమున— హృదయమును గలగుండువడఁజేయుచుఁ బైపైనివినవచ్చుచున్న వ్యాఘ్రగర్జనము లెంతటి భయంకరములుగా నుండును! ప్రకాశచంద్రుని యంతరాత్మయే శుష్కీభూతము కాఁ జొచ్చెను. ప్రతిగర్జనమునకును వడఁకుచు నాతనిప్రాణ మెగిరిపోవుచుండెను; ఇంతటివిపత్తునం దావిపద్భంజనుండైన శ్రీమన్నారాయణుఁడు తక్క నిఁక దిక్కేమి యున్నది? అప్పు డాతఁడు మనస్సున నా శ్రీహరినే ప్రార్థింపఁ జొచ్చెను.

మేలు భక్తవత్సల!—అంధకారమునఁ దిరుగుచున్న యాతనికి దూరమునం దాకస్మికముగ నొక వెలుఁగు కంటఁబడియెను. అప్పుడు ప్రకాశచంద్రుఁడు జగదీశ్వరునకు మనసారనమస్కరించి యా వెలుఁగున కెదురుగ దానిని లక్ష్యమునం దుంచుకొని చాలఁ గష్టముతో ముందటికిఁ బోయెను. ఒకచిన్న యింటినుండి యా వెలుఁగు వచ్చుచుండెను. బహుకష్టముతో నాతఁ డాయింటియెదుటికి వచ్చి నిలిచెను. ఇంటితలుపులు మూయఁబడి యుండెను. అతఁ డొంటిప్రాణముతోఁ దలుపు తట్టెను.

ద్వారము తెఱచుకొని దీర్ఘాకారముగల యొకమనుష్యుఁ డొకదీపమును బట్టుకొని వచ్చి యెదుట నిలిచెను. ప్రకాశచంద్రుఁ డాత్రముతోఁ గాతరకంఠుఁడై "నేను దారితప్పి

యీయరణ్యమునకు వచ్చితిని. నాకుఁ బ్రాణము పోవుచున్నది. ఆశ్రయ మిచ్చి నన్ను రక్షింపవలయును." అని చెప్పెను.

ఆదీర్ఘాకారమనుష్యుఁడు ప్రకాశచంద్రుని విశేషాదరముతో నింటిలోనికిఁ దీసికొని పోయెను.

---

## రెండవ ప్రకరణము.

---

ప్రకాశచంద్రుఁడు ప్రవేశించినయిల్లు, ఆకారమునఁ జొకముగానుండెను; చిన్నదికాదు; గొప్పదనియే చెప్పవలయును. గృహమధ్యమున నొకబల్లమంచ ముండెను. దానిపై నొకచాఁప పఱుపఁబడి యుండెను. ఇంటియం దొక భాగమునం దుఁ బులిచర్మములు రాశిగఁ బడియుండెను. అడవిచెట్లకొమ్మలను తడకలుగాఁ గట్టి పైని మంటిపూఁతఁబూసినగోడలు; అం దొకగోడపై నానావిధాస్త్రశస్త్రములు వ్రేలాడఁగట్టఁబడి యుండెను. ఇంటియం దొకచోట ననేకములగు కల్లులు రాశిగాఁ బడి యుండెను. ఇద్దఱుచు వచ్చి నడుమనున్న బల్లమంచముపైఁ గూర్చుండిరి. కూర్చుండినపిమ్మట నింటియజమానుని యాకృతి మీఁదను, నింటియందున్న పదార్థములమీఁదను, బ్రకాశచంద్రునిదృష్టి ప్రసరించెను. అతఁ డది యంతయును జూచి మనసున భయపడి యాశ్చర్యముతో మాటలేకుండఁ గూర్చుండెను.

అప్పుడాయింటియజమానునితీక్ష్ణదృష్టులాతనిపైఁబడియెను. ఆతఁడించుక నవ్వి "ఇంటియందాయుధములను జూచి మీరు భయపడుచుంటిరి కాబోలు! ఆయుధములు లేనిచో నీయడవియందుండు టెట్లు? మాయాయుధములచేఁ జేయఁబడు కార్యములను జూచితిరా ?" అని యడిగెను.

ఇట్లడిగి గృహయజమానుఁడు గృహమధ్యమునందు పడియున్న పులిచర్మములవైపునకు వ్రేళ్లుచాఁచిచూపించెను. ప్రకాశచంద్రునిభయకంపితమైన హృదయ మప్పుడించుక స్వస్థపడియెను. అతఁ డాత్రముతో "నాకు మిగులదాహము వేయుచున్నది. వేగముగఁ గొంచెము మంచినీటి నిప్పింపవలయును." అనియెను.

గృహ—మీరెవ్వరు?

ప్రకాశ—బ్రాహ్మణులము.

గృహయజమానుఁడు వేగముగ లేచి సంభ్రమముతో బ్రాహ్మణునకుఁ బ్రణామముల నాచరించెను. పిమ్మట నుచ్చస్వరముతో "ఆరణ్యేకా!" అని పిలిచెను.

ఒకనిమిషములోఁ బార్శ్వమునందుఁ దెఱవఁబడియున్న యొకగుమ్మమునుండి, జ్యోతివలెఁ బ్రకాశించుచుఁ బదునాలుగువత్సరముల వయసుగలయొకబాలిక వచ్చి నిలిచెను. ఆమె ప్రక్కగదినుండి వచ్చెను. భూమి బ్రద్దలుచేసికొని వచ్చినదా

యన్నట్లుగఁ దోఁచెను. ప్రకాశచంద్రున కేమియును దోఁచ లేదు. ఆతఁడు విస్మితలోచనుఁడై, కృష్ణవర్ణ విరాజితమై యాగుల్ఫలంబితమైయున్న వలుదపెన్నెఱిగుంపుతో నొప్పారు నాబాలికప్రఫుల్లవదనకమలమును జూచుచుండెను. ఆబాలికదృష్టియు మఱియొక దిక్కునకుఁ బోలేదు. ఆమె యాయపూర్వకాంతిసమన్వితంబగు నధరోష్ఠమునం దపూర్వమధురమందహాసమును వెలిఁజిమ్ముచు గృహస్వామికిఁ బ్రత్యుత్తరముగ "ఏమప్పా !" అనియెను.

గృహయజమానుఁడు ప్రకాశచంద్రునిఁ జూపుచు "వీరు పథికులు; త్రోవతప్పి మనయడవికి వచ్చి యున్నారు; ఫలాహారమున కేమైనఁ దెమ్ము. దానితోఁబాటు మంచినీటినిగూడఁ దీసికొని రమ్ము." అనియెను.

బాలిక యావెంటనే పథికునివైపునకుఁ దిరిగి యాతని దృష్టించి చూచెను. కాని, ఇదేమి ? ఒకముహూర్తమాత్రములో నాయపూర్వముఖకాంతి యిట్లు హృదయవికారముగ మాఱినదేమి ? అస్థిరసౌదామనీసదృశముఖకాంతి, యాకస్మికముగ నొకయపరిచితపథికునిం జూచి యిట్లు వివర్ణ మగుటకుఁ గారణమేమి ? ఆస్వర్గీయజ్యోతియందుఁ బ్రదీప్తములగు నధరోష్ఠము లీవిధమగుశోచనీయావస్థను బొందుటకుఁ గారణమేమి ? మేఘము గ్రమ్మకుండఁ, జండమారుతము వీవకుండ, నాకాశమునందున్న పూర్ణచంద్రుఁడు రాహుగ్రస్తుఁడై పోయెను. ప్రకాశచం

గ్రామ డీపరివర్తనములను జూచి తెలిసికొనియెను. కాని, యం దులకుఁ గారణ మూహింపఁజాలకుండెను. ఆతఁ డా బాలికను బ్రథమమునఁ జూచినంతమాత్రమున నెంతయాశ్చర్యమును బొం దెనో-అంతకు శతగుణములు హెచ్చగునాశ్చర్యముతోఁ జూడ సాగెను.

బాలిక ముఖమును వంచుకొని మెల్లమెల్లగ—ఎంత యో మెల్లగ నాస్థలమునుండి వెడలిపోయెను. కొలఁదిసేపటి లోనే యామె ఫలాహారమును బానపాత్రమును దెచ్చి యాతని ముందుపెట్టెను. ప్రకాశచంద్రునకు దాహముచేఁ బ్రాణము కంఠగత మగుచుండెను. ఆతఁడు ముందుగ మంచినీటినిద్రాగెను. అనంతరము గృహయజమానునిబలవంతముపై నించుక ఫ లాహారమును దీసికొనియెను. ఆఫలాహారముచే నాతనికిఁగడుపు నిండినదో లేదో—దానికేమి లెండు—గృహయజమానుని యాదరము, అభ్యర్థనము మొదలగుశిష్టాచారములచే నాతఁడు పరితృప్తుఁడయ్యెను. మొదట నాతనికి భయముగ నుండెను. ఇప్పు డాభయము వీడి హృదయము కృతజ్ఞతచే నిండిపోయెను. విశేషించి యాబాలికను జూచుటచే మరల భయమున కెట్టికా రణములు నాతనిమనసునకుఁ దోఁచలేదు.

ప్రకాశచంద్రుఁడు ఫలాహార మైనతోడనే ముందుగ "రంగపుర మిక్కడ కెంత దూరముండును ? నేను రంగపుర మునకుఁ బోవలయును." అని యడిగెను.

గృహ—మీరు రంగపురమునం దున్నట్టే—ఈయరణ్యము రంగపురమునకుఁ జేరినదే.

ప్రకా—రంగపుర మిక్కడ కెంతదూర మున్నది ?

గృహ—నగర మిక్కడనుండి యాఱుక్రోశములదూర ముండవచ్చును.

ప్రకాశచంద్రుఁ డీమాటను విని చకితుఁడయ్యెను. శ్యామపురస్టేషనునుండి రంగపురము మూఁడుక్రోశములు మాత్రమే. ఆతఁడు మూఁడునాలుగు గంటలసేపు విశ్రామము లేకుండ నడచి వచ్చియుండెను. ఇట్లుచేసినను, రంగపురము మూఁడుక్రోశము లుండుటకు బదులుగా నాఱుక్రోశములదూరముండుట యెట్లో యాతనికి బోధపడినది కాదు. కొంచెము సేపైన పిమ్మట నాతఁడు దానియోచనమును విడిచి వినీతభావముతోఁ దన కాశ్రయ మిచ్చిన గృహస్వామిని పొగడుచు "దయయుంచి మీరు నాకు రేపటియుదయమున రంగపుర మార్గమును జూపవలయు" నని యడిగెను.

ఇంటియజమానుఁ డించుకనవ్వి "అందుల కేమియును యోచింపనక్కఱలేదు. మీరు చాల శ్రమపడి యున్నారు. రాత్రి సుఖముగా నిద్రపోవచ్చును. తెల్లవాఱినపిమ్మట దారి చూపించెదను." అనియెను.

ప్రకా—మీ రీయరణ్యమున నాలుబిడ్డలతో నెట్లు కాపురము సేయుచున్నారు? మీ రీ దేశవాసులవలె నగపడుట లేదు.

గృహ—నాకుటుంబ మంతయు నీయాఁడుబిడ్డమాత్ర మే—మఱెవ్వరును లేరు. నే నీ దేశపువాఁడను గాను—పడు దలసీమ నాదేశము.

ప్రకాశచంద్రుఁడు మనఃపూర్వకముగా "మీరు నేఁడు నాకుఁజేసిన యుపకారమును, నాజన్మ మున్నంతవఱకును మఱచిపోఁజాలను. మీనామధేయ మేమి ?" అని యడిగెను.

గృహయజమానుఁ డించుక వెనుకముందులుచూచి "నాపేరు కిషణలాలు" అనియెను.

ప్రకాశచంద్రుఁ డీసమయమున బాలిక తెప్పవేయ కుండఁ దన్నే చూచుచున్నదని కనిపెట్టెను. ఆబాలిక యౌవనో న్ముఖియై యున్నను దనవంటి యపరిచితమనుష్యు నీవిధముగా నించుకంతైన సిగ్గు లేకుండఁ జూచుటను గాంచి ప్రకాశచం ద్రుఁడు మరల గృహయజమానునిగూర్చి "ఈబాలిక మీకో మారితయేనా?" అని ప్రశ్నించెను.

గృహ—అవును. ఆరణ్యైక నాకొమారితయే.

ప్రకా—ఇంతటిపరమసుందరియగు తనయ కామెరూప మునకుఁ దగినపేరు పెట్టలేకపోయితిరా ?

గృహ—నా యీబిడ్డ యరణ్యమునందే పుట్టినది. అరణ్యమునందే పెరిగి పెద్దదైనది. ఎప్పుడు నూరిజనులను జూచియుండలేదు. అందువలన నీమె నారణ్యక యని పిలుచుచుంటిని. ఈమెకుఁ బేరేమియును బెట్టలేదు.

ఈసమయమున నారణ్యక "అప్పా! పరమసుందరి యనఁగా నెవ్వరిని పిలిచెడిమాట?" అని యడిగెను.

కిషణలా లించుకనవ్వి "ఎవ్వతె చూచుటకు మిగులనందకత్తెగా నుండునో యామెను పరమసుందరి యని పిలిచెదరు." అని చెప్పెను.

ఆరణ్యకయు నాయుత్తరక్షణమందే "అప్పా! అట్లనా? అట్లయినచో నేను చూచుటకు మిగులనందముగా నున్నానా? నన్నుఁ బరమసుందరి యనిచెప్పు నీమనుష్యునికంటెను నేను మిగులనందముగా నున్నానా?" అనియెను.

తనయ యడుగుచున్న యామాటలను వినుటచే, నాకస్మికముగఁ దండ్రిముఖమునం దించుక యసంతోషచిహ్నములు పొడసూపెను. కిషణలాలు బొమముడిపాటుతో నావెంటనే "ఆరణ్యకా! చాలరాత్రి యైనది. పోయి పరుండుము." అనియెను.

ఆరణ్యకయుఁ బ్రకాశచంద్రునిముఖమునే చూచుచు మెల్లమెల్లగ నక్కడనుండి వెడలిపోయెను. వెడలిపోవుచున్నప్పు

డామె నిట్టూర్పును విడిచినశబ్దము ప్రకాశచంద్రునిచెవిని బడి యెను.

ఆరణ్యక వెడలిపోయినపిమ్మటఁ గిషణలాలు ప్రకాశ చంద్రునిఁజూచి "మీకుఁ జాలశ్రమగానున్నది. ఇఁక నాలస్యము చేయనక్కఱలేదు. ఇప్పుడు మీరు దయచేసి పరుండుఁడు. రేపటియుదయమున మీకు మార్గమును జూపించెదను." అని యెను.

ఇట్లుచెప్పి కిషణులాలు లేచెను. ప్రకాశచంద్రుఁడును లేచి నిలుచుండెను. కిషణలాలు ప్రకాశచంద్రుని వెలుపలిగృహమునుండి తీసికొనిపోయి ప్రక్కనున్న యొక చిన్నయింటిని జూపి "మీ రీయింటియందుఁ బరుండవచ్చును." అనియెను.

కిషణలా లిట్లుచెప్పి తనయింటికి వెడలివచ్చెను. ప్రకాశచంద్రుఁ డాచిన్నయింటిలోనికిఁ బోయి దీపపువెలుతురున నంతయును జూచికొని తలుపు గొళ్ళెము పెట్టుకొనుటకై ద్వారమునొద్దకుఁ బోయెను. ఆసమయమున నారణ్యక మించువలెఁ బరువెత్తుకొని వచ్చి గొళ్లెమును జేతితో బలముగా నదిమిపట్టి తలుపు నంటుకొని లోపలికి వచ్చెను. వచ్చినయామె చేతిసంజ్ఞతోఁ బ్రకాశచంద్రుని మాటలాడకుండ నుండుమని బోధించెను. ఆరణ్యక యీరహస్యచర్యలను జూచి ప్రకాశచంద్రుఁడు మొదట నించుకసేపు స్తంభితుఁడై పోయెను. పిమ్మట నాతని శరీర మంతయు భయముచే గడగడవడఁక నారంభించెను. ఆర

ణ్యక తనముఖము నాతనిచెవియొద్ద నుంచి మెల్లమెల్లగఁ "జాగరూకుఁడవై యుండుము—నేఁటిరాత్రి నిద్రపోవలదు. నిద్ర పోయినచోఁ బ్రాణములుపోవును. నాతండ్రి బందిపోటుదొంగ. నీవు దొంగవానిచేతిలోఁ బడిపోయితివి. కాని, నేను నిన్ను ప్రాణాపాయముచుండి తప్పించెదను." అని చెప్పెను.

ఈమాటలు చెవిలోఁ బడఁగనే ప్రకాశచంద్రుని ప్రాణము లెగిరిపోయిన ట్లయ్యెను. ఆతనినోటివెంట మాట నచ్చుటలేదు. ఎవ్వరితో మాటలాడుట?—ఈమాటలు చెప్పి యారణ్యక తత్క్షణమే వెడలిపోయెను. ప్రకాశచంద్రుఁడు త్వరపడుచు వేవేగముగఁ దలుపుమూసికొని లోపలిగొళ్లెమును పెట్టుకొని భద్రపడియెను. తుద కాతఁడు తలమీఁద చేయినుంచుకొని గృహమధ్యమునఁ జదికిలఁబడియెను. ఈసమయమునకు సరిగా లోపల వెలుఁగుచున్నదీపము చమురులేక యారిపోయెను. ఇల్లంతయు నంధకారమయ మయ్యెను. ఆతఁ డాయంధకారమునఁ గూరుచుండి ఆకాశపాతాళములగూర్చి యాలోచింప నారంభించెను. అప్పు డాయింటివెలుపల నెవ్వరో ద్వారమునకు బీగము వైచినశబ్దము వినఁబడెను. ఆతఁడు నిశ్చయముగా దొంగలచేతిలోఁ బడిపోయితి నని తెలిసికొనియెను. ఇప్పు డింకేమి యుపాయ మున్నది?

ఇంకేమియు నుపాయము లేదు. అప్పు డాయారణ్యక చెప్పిపోయినధైర్యోక్తి యొక్కటియే యాతని కాధారమై యుండెను. కాని యామాటలను నమ్ముట యెట్లు? దొంగవానికూఁతురుమాట నెప్పుడైన నమ్మియుండవచ్చునా? ఆమె తండ్రికి విరోధముగా వచ్చి నిలువగలదా? అపరిచితుఁడైన మనుష్యునికొఱకు కంతవఱకు సాహసించుట కామె కేమి యావశ్యక మున్నది? ప్రకాశచంద్రునకిది యంతయుఁ బరిహాస మని తోఁచెను.

అప్పుడు వెలుపల నెవ్వరో మఱియిద్దఱు మనుష్యులు కిషణలాలుతో నేకాంతముగా మాటాడుచున్న శబ్దము వినవచ్చెను. ప్రకాశచంద్రుఁడు కంపితహృదయముతో లేచి మెల్లమెల్లగ సద్దుచేయకుండఁ గిటికీయొద్దకుఁబోయి నిలుచుండెను. మొదట నేమేమో యస్పష్టముగ మాటలాడుకొన్నది యాతనికి బాగుగ వినఁబడలేదు; చాలసేపు స్థిరభావముతో నూపిరి విడువకుండ వినుచు నిలుచుండెను. తుదకుఁ గొన్నిమాటలు వినఁబడియెను—

కిష—బుక్కణ! చేతియం దుంగరమున్నది. గడియారము గొలుసుకూడనున్నప్పు డాతనియొద్ద డబ్బుకూడ నుండవచ్చునని తోఁచుచున్నది.

బుక్కణలాల్—మీచేతిలో వచ్చిపడినప్పు డవశ్యముగ నేదియో యుండియేయుండును.

ఈసమయమందు విష్ణులాలను మఱియొకదాంగ "అతఁడీ పాటికి నిద్రించియుండు నని తోఁచుచున్నది. ఇప్పుడే కార్యము ను తుదముట్టింపవలయును." అని చెప్పెను.

కిషణలాలు మరల "కొంచెము సేపాఁగవలయును. ఆర ణ్యైక పనుండినసేగాని యీకార్యము చేయుటకు వలను గాదు. ఆమనుష్యుని జూచుటచేఁ బిల్లకు దల తిరిగినట్లు తోఁచుచున్న ది." అనియెను.

ఈపూర్వోక్తసంభాషణమును వినుచున్న ప్రకాశచం ద్రునిప్రాణములు నిలువ నెగిరిపోయెను. అతఁ డిఁక నిలువఁ జాలకపోయెను. మెల్లమెల్లగ నక్కడనే చదికిలఁబడియెను. అప్పు డెవ్వరో ద్వారపుబీగమును వెలుపలఁ దీయుచున్నశబ్దము వినఁబడియెను. ప్రకాశచంద్రునిప్రాణము వడివడిగఁ గొట్టుకొన నారంభించెను. ఆపరక్షణమునందే యెవ్వరో తలుపు తెఱచు కొని లోపలికి వచ్చినట్లయ్యెను. ప్రకాశచంద్రునిప్రాణ మరఁటి యాకువలెఁ గంపింప నారంభించెను. అతఁడు ప్రాణముపై నాశ వదలుకొని ప్రతిక్షణమునందును మృత్యువు నెదురుచూచు చుండెను.

అంధకారమునందు గదిలోనికిఁ బ్రవేశించినవ్యక్తి చప్పుడు గాకుండ నడుగుల నిడుచు నింటిమధ్యమునందున్న ప్రక్కయొద్దకు వచ్చి ప్రకాశచంద్రుని తడవి వెదకుచున్నట్లు కనఁబడియెను. అప్పుడు ప్రకాశచంద్రుఁడు భయముచేఁ బోయి యొకమూలఁ గూర్చుండెను. ఆగంతుకవ్యక్తి యప్పు డస్పష్టస్వరముతో "ఎక్కడ నున్నావు? వేగముగ నాతోరా." అని పిలిచినట్లయ్యెను.

కంఠస్వరమువలనఁ బ్రకాశచంద్రుఁడు పిలిచిన దారణ్యకయని తెలిసికొనియెను. అప్పుడు మృతప్రాయమైయున్న యాతని దేహమునందుఁ బ్రాణసంచారము కలిగెను. అతఁడు లేచి నిలుచుండి మెల్లమెల్లగ "నే నిక్కడ నున్నాను." అని చెప్పెను.

ఆమాటవిని యారణ్యక యావైపునకుఁ బోయి ప్రకాశచంద్రుని చేతినిఁ బట్టుకొనియెను. అనంతర మామె మిగుల జాగరూకతతో నాతనిం దనవెంట నిడుకొని యింటినుండి యీవలికివచ్చెను; అక్కడనుండి యాతనిచేతిని బట్టుకొని వింటినుండి విసరఁబడినయంబువలె వేగముగఁ బరువెత్త నారంభించెను. ప్రకాశచంద్రుఁడు కేవలము ప్రాణభయముచే నామెతో నంతటి వేగముగాఁ బరువెత్తుటకు సమర్థుఁ డయ్యెను. లేకున్న నాయంధకారమునం దంతటినిబిడారణ్యమునందుఁ గాలుంచుటకు

సాధ్యము లేదు. ఆయరణ్యమునం దారణ్యైకకు రేయుంబవలులు సమానములే. పుట్టినది మొదలలవాటుపడియుండుటచే నామె కేమియుఁ గష్టముగాఁ దోఁచలేదు. ప్రకాశచంద్రుని చేతిని పట్టుకొని పోవుట కామెకుఁ గష్టముగా లేదు. ఎందువలనఁ గష్టముగలేదో ముందు బోధపడఁగలదు.

---

## మూఁడవ ప్రకరణము.

ఈవిధముగాఁ బరువెత్తుచు వారిద్దఱు నరణ్యమునఁ జాలదూరమేగిరి. ఆయరణ్యమున నారణ్యైక కన్నితావులును పరిచితములైనవియే. ఆకారణమున వారు పరువెత్తుకొనిపోవుటకేయభ్యంతరమును గలుగలేదు. ఆరణ్యైక కంధకారము నందుఁ గూడఁ గన్నులు గనఁబడునని ప్రకాశచంద్రునకు బోధకాఁజొచ్చెను. ఒక బాలికచేయు నీసాహసకృత్యముచేఁ బ్రకాశచంద్రున కాయంధకారమునం దాయడవిలోఁ బోవుట కించుకయు భయము కలుగలేదు. ఈవిధముగా వారిరువురును గొంచె మించుమించుగ రెండుక్రోశములదూరమువఱకును బోయిరి. ఆరణ్యైక కాయాసముకలిగినట్లు తోఁచలేదు. కాని, ప్రకాశచంద్రునకుఁ బ్రాణము కంఠగత మగుచుండెను. అతఁడీక నాబాలికతో నావిధముగాఁ బరువెత్తుటకు మిగుల నసమర్థుఁడైపోయె

ను. ఆరణ్యైక కాసంగతి బోధపడియెను. అప్పుడు వా రాయడ వియం దారణ్యైకకుఁ బరిచితమైయున్న యొకయేకాంతస్థలమున దాఁగియుండి మిగిలిన రాత్రియంతయును గడపిరి.

తెల్లవాఱుజామున వారు మరల బయలుదేఱిరి; సూర్యోదయ మగులోపల నాయడవినిదాఁటి యొకవిశాలప్రదేశమునకు వచ్చిరి. అక్కడనుండి యారణ్యైక వెనుదిరిగి పోయెద నని ప్రకాశచంద్రునితోఁ జెప్పి యాతనియనుజ్ఞను వేఁడుకొనియెను. ఆమె కన్నుల నీరుఁబెట్టుకొని కాతరస్వరముతో "ఇఁక భయమేమియును లేదు. ముందు సాగిపోవచ్చును." అనియెను.

ప్రకాశచంద్రుఁ డారణ్యైకకుఁ గలిగిన యీభావమును గనుపెట్టి యాశ్చర్యపడియెను. కాని దానివిషయమున నేమియు నడుగక మొదట "ఇప్పు డేదిక్కుగాఁ బోయినచో రంగపురమున కేగుమార్గము దొరకును?" అని యడిగెను.

ఆర—అది నాకుఁ దెలియదు. నే నెప్పుడు నీయడవిని విడిచి పైకి రాలేదు.

ప్రకాశచంద్రుఁ డారణ్యైకముఖ మించుక సేపు దృష్టించి చూచి పిమ్మట నామెనుగూర్చి "ఆరణ్యైకా! నీవు నాప్రాణమును గాపాడితివి. ఇప్పుడు నీవు మరల నింటికిఁ బోయినచో నీకు విపత్తుకలుగును." అని చెప్పెను.

ఆర—నన్నుఁ జంపివేయఁజాలరు. కాని, బలముగ గొట్టెదరు. అందులకు విచారము లేదు.—నేను దెబ్బ లెన్నియైనఁ దినఁగలను.

ప్రకాశచంద్రుఁ డాశ్చర్యపడి "నీతండ్రి నిన్నుఁ గొట్టునా?" అని యడిగెను.

దెబ్బలగాయపుగుర్తులను జూపించెదనని చెప్పి యారణ్యక ప్రకాశచంద్రునకు దెబ్బలగుర్తులను జూపించెను. అందువలనఁ బ్రకాశచంద్రుఁడు "నేను నీతో వచ్చుట మంచిపని కాదు. నిన్ను విపత్తునకు గుఱిచేసి నేను విపత్తునుండి బయటఁబడితిని" అనియెను.

ఆర—నీప్రాణము పోవలసినది. నీకే నిజముగ విపత్తు కలిగినది. నాకుఁ బ్రాణభయము లేదు. నాకిఁక విపత్తెక్కడిది?

ప్రకా—నీవు నాతోఁగూడ రాఁగూడదా? ఏసుఖము కొఱకు నీ వీయడవియం దుండెదవు?

ఆర—అడవియం దుండుటయే నాకు సుఖమని తోఁచుచున్నది. నాతో నీయడవియందు రెండుదినములుండి చూచినచో నీ వాసుఖము నెప్పటికిని మఱువఁజాలవు. అడవిని విడిచి బైటికి వచ్చుటకు నాకు మిగుల భయమగుచున్నది. కాని, నీతో వచ్చుటకు నాకెంతో యిష్టముగా నున్నది. నిన్ను విడిచిన

చో నీసుఖమయమైన యడవిగూడ నాకు బాగుగ నుండునని తోఁచుట లేదు.

ప్రకాశచంద్రుఁ డాహ్లాదితుఁడై యామెతో "నీవు నాకుఁ బ్రాణదానమును జేసితివి. నీవు మరల నీయడవికిఁ దిరిగిపోవుటనాకిష్టము లేదు. సి న్నానిష్ఠురుఁడైన తండ్రిచేతులనుండి రక్షించెదను. నాతో రమ్ము. నేను నాప్రాణములనైన సమర్పించి నిన్ను సుఖవతిగాఁ జేసెదను" అనియెను.

ఆరణ్యైక ప్రకాశచంద్రుని ముఖమును దృష్టించి చూచుచు "అట్లయినచో నడువుము. అట్లయినచో నడువుము "అని మెల్లమెల్లగఁ జెప్పెను.

అప్పుడు ప్రకాశచంద్రుఁ డానందముచేఁ బరవశుఁడై యాయారణ్యైకను వెంటఁబెట్టుకొని యాప్రదేశమునుండి ముందటికి బయలుదేఱెను. ప్రకాశచంద్రుఁడు మున్ముందు పోవుచుండెను. ఆరణ్యైక యాతనివెనువెంట నేఁగుచుండెను. ఆయంధకారము లేదు. ఆయరణ్యమును లేదు. అయినను, నారణ్యైక యాకస్మికముగ నాతనిపార్శ్వమునకు వచ్చి మొదటివలెనే యాతనిచేతిని బట్టుకొనియెను. ప్రకాశచంద్రుని శరీర మంతయు రోమాంచిత మయ్యెను. ఆతఁ డేమి యోచించుకొనియెనో గాని యామె చేయిపట్టుకొనుట కభ్యంతరము చెప్ప లేదు— ఇద్దఱు నట్లే నడచుచుండిరి. పోవుచుఁ బ్రకాశచంద్రుఁడు "ఆర

ణ్యకా! నీతండ్రిని దప్ప మఱెవ్వరిని నీవు చూడలేదా ?" అని యడిగెను.

ఆర—చూచి యుంటిని—విష్ణులా లున్నాఁడు. బుక్క ణలా లున్నాఁడు. కాని, వారితో మాటాడుట కెప్పుడును నా కిష్టముగా లేదు.

ప్రకా—ఎందుల కిష్టముగా లేదు ?

ఆర—వారు నీవలె చూచుట కందముగా నున్నారా? నీవలె బాగుగ మాటాడఁగలరా ? వారలదగ్గఱ కేగినచో నా కసహ్యముగా నుండును.

ప్రకా—వారును నీతండ్రికి స్నేహితులు. నీతండ్రిపై నీ కసహ్యతయా ?

ఆరణ్యక యించుక యోచించి "తండ్రిపై నాకంత యస హ్యతలేదు. కాని యతనికొఱకు దుఃఖము కలుగును. అనేక సమయములయం దాతనికొఱ కేడ్చితిని" అనియెను.

ప్రకాశచంద్రుఁ డాశ్చర్యపడి "నీవు పాపాత్మునియింటఁ బెరిగియు నెట్లింతపుణ్యవతి వైతివి?" అని యడిగెను.

సరళహృదయ యగునాబాలిక వ్యసనభావముతోఁ ప్రకాశచంద్రుని ముఖమును జూచుచు "పాపపుణ్యము లనునవి యేమో నే నెఱుంగను." అనియెను.

ప్రకా—నీతండ్రి యేమిపని చేయుచున్నాఁడు ?

ఆర—నాతండ్రి బందిపోటు వేయుననియు, మనుష్యులను జంపు ననియు వినియున్నాను. ఆతనియొద్దనున్న దంతయు దొంగతనముచేసి సంపాదించినదియే.

ప్రకా—ఇట్టిపనుల కన్నిటికిఁ బాపకార్యము లనిపేరు. నీతండ్రి యిట్టిపనులను జేయుచుండు నని జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల నీమనస్సునకుఁ గష్టముగాఁ దోఁచుట లేదా?

ఆర—కష్టముగాఁ దోఁపకేమి? చాలఁ గష్టముగా నుండును.

ప్రకా—అది నీపుణ్యమునకు గుఱుతు.

ఆరణ్యక యించుక యోచించి "మంచిది. నీజతయందుండుటకు నాకుఁ జాల నానందముగా నున్నది. నిన్ను విడిచి యెక్కడకుఁ బోవుటకును నాకిష్టము కలుగుట లేదు. అందువలననే తండ్రిని విడిచి నీతో వచ్చితిని. ఇది పుణ్యమా లేక పాపమా?" అని యడిగెను.

ప్రకా—నీమనస్సునకుఁ గష్టముతోఁపకుండ నున్నచో నప్పు డది పుణ్యకార్య మనియే తెలిసికొనుము. ఏపనిచేయుట కారంభించినచో మనస్సునకుఁ గష్టమగుచుండునో యది పాపకార్యము.

ఆరణ్యక నవ్వి "పాపపుణ్యము లనునవి యిపుడు బాగుగఁ దెలిసినవి." అనియెను.

ప్రకా—మంచిది. ఆరణ్యైకా! పాపకార్యముచేసినచో నెట్లుండును? పుణ్యకార్యము చేసినచో నెట్లుండును? జ్ఞప్తి యున్నదా?

ఆర—పాపకార్యము చేసినచో మనస్సునకుఁ గష్టముగానుండును. పుణ్యకార్యమాచరించినచో మనసున కానందముగా నుండును.

ప్రకా—మనుష్యుఁడు చచ్చు నని యెఱుఁగుదువా?

ఆర—అది విని యున్నాను.

ప్రకాశచంద్రుఁ డప్పుడు గంభీరభావమును దాల్చి ఇట్లు చెప్పఁదొడఁగెను. "చచ్చిపోయినపిమ్మట నీపాపపుణ్యములను గూర్చిన విచారణ నగును. ఎవ్వఁ డీసమస్తబ్రహ్మాండమును సృష్టించి యున్నాఁడో యాతఁడే యీపాపపుణ్యములకు విచారణకర్త. మనుష్యుఁ డీపాపపుణ్యములఫలము నింకొకజన్మమునం దనుభోగించును. ఆరణ్యైకా! సంసారము మిగులఁ గష్టమైన స్థలము. విశేషజాగరూకతతో నడచుకొనకపోయినచో సంసారమునం దడుగడుగునకును విపత్తున్నది. నీవు సంసారమునఁ బ్రథమప్రవేశము చేయుచుంటివి. ఆకారణమున నీవు విశేష జాగరూకతతో నుండవలయు నని తెలుపుచుంటిని. సంసారమునందుఁ బాపకార్యములకుఁ జేరిన యనేకభయంకరప్రలోభము లున్నవి. మనమనస్సును మనస్వాధీనమునం దుంచుకొనఁ జాలనిచో సంసారలోభములను జయించుటకు వలనుగాదు.

నీ వెట్టియాశకును లోఁబడనేర వని నాకు ధైర్యమున్నది." అని చెప్పెను.

ఆరణ్యైక యంతసేపును విస్మితనేత్రయై ప్రకాశచంద్రుని ముఖమును దదేకదృష్టితోఁ జూచుచుండెను. ఆతఁడు చెప్పుచున్నదానిని ముగించినపిమ్మట మెల్లమెల్లగ "ప్రలోభ మనఁగా నేమి?" అని యడిగెను.

ప్రకా—పాపకార్యమును జేయుటలో మనమున నడఁప శక్యముగాకుండఁ గలుగుచున్నయాశను నేను ప్రలోభ మని చెప్పుచుంటిని.

ఆర—ఆయాశ మనస్సునం దున్నప్పుడు, మనసున కొకవిధమగు కష్టము కలుగుచుండును.

ప్రకా—మొట్టమొదట నట్లే కష్టముగాఁ దోఁచుచుండును. పిమ్మట నట్లుండదు.

ఆర—ఏపనివలన మనస్సునకుఁ గష్టము గలుగుచుండునో నే నట్టికార్యము నెప్పటికిని జేయఁజాలను. ఏపనిని చేసినచో మనసున కానంద మగుచుండునో నే నట్టికార్యమునే చేయుచుండెదను.

ప్రకాశచంద్రుఁడు "నేను నీమాటలను విని మిగుల నానందించితిని." అని చెప్పెను.

ఈవిధముగా మాటలాడుకొనుచుఁ బోయి వా రొక గ్రామమును సమీపించిరి. గ్రామమునఁ బ్రవేశించినతోడనే

ప్రకాశచంద్రుఁ డొకబండిని గుదిర్చి దానిపై రంగపురమునకు బయలుదేఱెను. పాపపుణ్యము లని వేనినిఁ జెప్పెదరో వాని నీసంసారజ్ఞానములేని బాలికకుఁ దెలియఁ జెప్పుటలోఁ బ్రకాశ చంద్రునకుఁ గలిగినసంతోషము ప్రయాణమై పోవుచున్నప్పు డల్లే యుండలేదు. ఎందుల కట్లయినదో, దాని కారణము ముందుఁ దెలియవచ్చును.

---

## నాల్గవ ప్రకరణము.

జగచ్చంద్రునకు రంగపురమునకు డిప్యూటీమేజస్ట్రేటు. ఇరువదివత్సరములనుండి యాప్రదేశమునందే పని చేయుచుం డెను. ఆపనియం దాతఁడు గౌరవమును, మర్యాదను, గీర్తిని సంపాదించి యుండెను. ఇప్పు డాతఁడు మొదటితరగతి మేజ స్ట్రేటై యుండెను. అప్పు డప్పు డాజిల్లామేజస్ట్రేటుపనినిఁ గూడ జూచుచుండును.

జగచ్చంద్రునకు బురుషసంతానము లేదు. ఆతనిభార్య చనిపోయెను. ఆతని కిద్దఱాడుపిల్లలుమాత్ర ముండిరి. పెద్దపిల్ల పేరు హైమవతి. రెండవయామెపేరు ప్రభావతి. హైమవతికిఁ బిన్నతనమునందే భర్త చనిపోయెను. ఆమె కిరువదియొకటవ వత్సరము. ప్రభావతికిఁ బెండ్లియై యిప్పటికి రెండుసంవత్సరము

లయ్యెను. ఆమెకుఁ బదుమూఁడువత్సరములు నిండెను. హైమ వతి పుట్టినపిమ్మట జగచ్చంద్రున కిద్దఱుమగపిల్లలు గలిగిరి. కాని వారు శైశవమునందే చనిపోయిరి.

పిమ్మట నొకయాఁడుపిల్ల కలిగెను. ఆశిశు వొకయేఁ డాదివయసునఁ బిల్లలనెత్తుకొనిపోవు దొంగలచేతిలోఁ బడిపో యెను. అప్పుడు ప్రభావతి తల్లిగర్భమునందుండెను. జగచ్చం ద్రునిభార్య యాకాలమునఁ బ్రభావతినిఁ బ్రసవించి పుత్త్రికా శోకమున మేనువిడిచెను. ఇంటియందు మఱెవ్వరును లేకపో వుటచే సంసారభార మంతయుఁ బదునాలుగువత్సరముల వయసు గలిగిన హైమవతిపైఁ బడియెను. తుద కప్పుడు పుట్టినశిశువును సంరక్షించుభారముకూడ నామెమీఁదనే పడియెను. జ్యేష్ఠ సోదరియలౌకికస్నేహవాత్సల్యములచేఁ బ్రభావతి పెరిగి పెద్దదయ్యెను. ఆప్రభావతి కిప్పుడు పదుమూఁడేండ్లు మీఱి యుండెను.

నేఁటిసాయంకాలమున హైమవతి తనప్రాణసమాను రాలైన ప్రభావతిముఖము మలినమై వ్యసనాక్రాంతమైయుం డుటనుజూచి మిగులవ్యాకులపాటును బొందెను. హైమవతి మలినమైయున్న యామెచిన్నిమోమును ముద్దుబెట్టుకొని "ప్ర భా! నేఁడు నీకు శుభదినమై యున్నది. చాలదినములకుఁబిమ్మ ట నీభర్త వచ్చుచున్నాఁడు. ఇట్టిసమాచారము విని యుండి యు, నీముఖము మలినమై యుండుట యేమి ?" అనియెను.

ప్రభావతి మెల్లగఁ దనముఖమును వంచుకొనియెను. ఆమె హైమవతి ప్రశ్నమున కుత్తరము నీయఁజాలకపోయెను. అప్పుడు హైమవతి వంగియున్నయామెముఖమును మీఁది కెత్తి "ఛీ! ప్రభా! నీవెనిమిటి వచ్చుచున్నాఁడు. నీవు బాగుగఁ దల దువ్వవలయును. నీవు మంచిక్రొత్తచీరను గట్టుకొనవల యును. నీయలంకారముల నన్నిఁటిని ధరింపవలయును. నీ వీవి ధముగా ముఖమును వంచుకొని యుండవచ్చునా సోదరీ!" అనియెను.

అప్పుడు ప్రభావతి తల హైమవతివక్షస్థలముపైఁ జే రెను. హైమవతి స్నేహభావముతోఁ బ్రభావతిని గౌఁగిలించు కొనియెను. కాని, యిదియేమి? ప్రభావతి వెక్కివెక్కి యే డ్చుచున్నదేమిటికి?—ఆయేడ్పును జూచుటచే హైమవతి కన్నులనుండియు (ఎవ్వరికిఁ దెలియును?) ఎందులకో, ఎక్కడ నుండియో, ఒకటిరెండశ్రుబిందువులు జాఱిపడియెను. ఆశ్చ ర్యనిమగ్న యగుహైమవతి యావెంటనే తనకన్నీటిని దుడిచి కొని తనవస్త్రపుచెఱఁగుచేఁ బ్రభావతికన్నీటిని దుడుచుచు న నునయవచనములతో బుద్ధిగఱపునదియై "ప్రభా! ఇదేమి? ఇప్పు డేడ్చుచుంటి వెందులకు? స్త్రీకింతకంటెను సంతోషదిన మున్నదా? కేవలమును జిన్నిబిడ్డవలె నుండఁబోకుము. నీకింక ను జ్ఞానములేదా? చూడుము? స్త్రీకి, అక్కయేమి, అన్న

యేమి, తల్లియేమి, తండ్రియేమి, వీరెవ్వరును బెనిమిటికంటె గొప్పవారు కాఁబోరు." అనియెను.

తుదిమాటను జెప్పునప్పుడు హైమవతికంఠస్వర మా కస్మికముగా గాద్గద్యమును బొందినదేమి? ఓహో! మేము మఱచితిమి. హైమవతి బాలవితంతువు!

హైమవతి చాలసేపు ప్రభావతి ననేకసమాధానవాక్యములతో బహుభంగుల సంతోషపఱచెను. పిమ్మట నామెకుఁ దలదువ్వటకై కూర్చుండెను. తలదువ్వట పూర్తియగునప్పటికి సాయంకాల మగుచుండెను; పిమ్మట ప్రభావతి నమూల్యవస్త్రాభరణాదులచే శృంగారించెను.

క్రమక్రమముగా రాత్రి యెనిమిదిగంట లయ్యెను. అప్పుడు హైమవతిహృదయము సంతోషముచే నిండియుండెను. కాని, ప్రభావతిహృదయము భయముచే దడదడ కొట్టుకొనుచుండెను. ఈసమయమునందు వెలుపల నొకబండి వచ్చి నిలిచిన చప్పుడయ్యెను. హైమవతి యుత్ఫుల్లనయనయై యావైపునకుఁ జూచుచుండెను. కొంచెముసేపటిలో నొకసేవకుఁడు వచ్చి "అమ్మా! అల్లుడుగారు రాలేదు. మేము స్టేషనులో జాల వెదకితిమి. కాని, వారు వచ్చినట్లగపడలేదు." అని చెప్పెను.

ఆమాటలు విని హైమవతి మిగుల వ్యాకుల యయ్యెను. కాని, ప్రభావతి యానందముతో నుబ్బుచు నక్కడనుండి పరు

గెత్తుకొని పోయెను. హైమవతి యామె వైపునకుఁ జూడకయే భృత్యునింగూర్చి "రామచరణా! అల్లుఁడుగా రెందుకు రాలేదు? కనుఁగొంటివా?'' అని యడిగెను.

భృత్యునిపేరు రామచరణుఁడు. అతఁడు "అది నాకె ట్లుతెలియును? అమ్మా! యజమానులకును దెలియలేదు. వారు కలకత్తాలో బండి నెక్కినట్లు తంతివార్తమాత్రము వచ్చినది. కాని యక్కడకు వారు రాకపోవుటచేత యజమానులును జిం తించుచున్నారు.'' అనియెను.

ఆసమయమున హైమవతి వ్యాకులహృదయముతో నాలుగువైపులకును జూచుచుండెను. అప్పుడు ప్రభావతి య క్కడ లేకుండుటను జూచి యామెను వెదకుటకై లోనికిఁబో యెను. కాని ప్రభావతియానందమును జూచి యామె యాశ్చ ర్యపడియెను. కొంచెమునే పయినపిమ్మట "ప్రభా !" అని యెను.

ముందుమాట వచ్చులోపలఁ ప్రభావతి "అక్కా! నా వస్తువు లన్నిటిని దీసివేయుము. నాకు వీనితో నుండుట కిష్టము లేదు." అనియెను.

హైమవతి యామెను సతృష్ణనయనములతోఁ జూచు చు "ప్రకాశచంద్రుఁడు రాలేదని నీకించుక విచారమున్నదా" అనియెను.

మనపూర్వపరిచితుఁడగు ప్రకాశచంద్రుఁడు జగచ్చం ద్రుని యల్లుఁడని చెప్పవలసిన యావశ్యకము లేదు.

ప్రభావతి ముఖమును వంచుకొని యాప్రశ్నమున కెట్టి యుత్తరము నీయలేదు. హైమవతి మరల "చూడు! ప్రభా! నీవు నాకు సోదరి వని యనుకొనుటలేదు. నాకడుపునఁబుట్టిన బిడ్డకంటెను హెచ్చుగాఁ జూచుకొనుచుంటిని. నేను చేసినయాశీర్వాద మెన్నటికిని నసత్యము కాఁబోదు. నేను నీకాశీర్వాదము చేయుచున్నాను. నీవు తప్పక నీపెనిమిటికొఱకుఁ బిచ్చిదానవై తిరిగెదవు. ఇప్పు డెవ్వరిపేరు నెత్తినంతనే కోపముతోఁ బాఱిపోవుచుంటివో, యాతఁ డొకనిమిషము కనఁబడకున్నచోఁ బ్రపంచ మంతయు నంధకారమయ మని తెలిసికొందువు. నీప్రాణము లున్నంతవఱకు నీవిట్లే యుండెదవు." అని చెప్పి "కాని, నా కెవ్వరు నిట్టి యాశీర్వాదమును జేయలేదు." అని యనుకొనియెను.

అప్పుడు ప్రభావతి "అక్కా! నాకు నిద్ర వచ్చుచున్నది. నానగలు మొదలగునవి తీసివేయుము" అనియెను.

హైమవతి యందుల కేమియు నడ్డుచెప్పక కన్నీటిని దుడుచుకొని, ప్రభావతి యొడలినున్న యలంకారముల నన్నిటిని దీసి యామెకు మఱియొకచీరను గట్టనిచ్చెను. ప్రభావతి యాచీరను గట్టుకొని తనకయి పఱచియుంచిన పక్కపైఁ బరుండి వెంటనే నిద్రవోయెను.

ఆసమయమున జగచ్చంద్రుఁ డాగదిలోనికి వచ్చెను. ఆతఁడు హైమవతి వ్యాకులయై యుండుటనుజూచి "ఏమితల్లీ! నీవు ప్రకాశచంద్రునికొఱకు విచారించుచుంటివా? ఆతఁడు వచ్చునప్పు డెవ్వరో యొకస్నేహితునిబలవంతముమీఁద మధ్య మార్గముననే మఱియొకస్టేషనులో దిగియె నని తోఁచుచు న్నది. అట్లుకానిచో, నేదోపనిమీఁద బండినుండి దిగి యాలసిం చుటచే బండి తప్పిపోయియుండవచ్చును. ఆతఁ డొకస్టేషనులో దిగబడిపోయె నని తోఁచుచున్నది." అనియెను.

హైమ—అట్లే కానిండు. అట్లయినచో నొకతంతివార్త నంపకూడదా?

జగ—అవును. రేపటియుదయమునకు రావచ్చును గదా యని యాతఁ డట్లు గావింపలేదని యనుకొందును.

హైమ—నాకు మనసులో నేమేమియో దుర్భావ నలు తోఁచుచున్నవి. ఈరాత్రి జరగుటయెట్లు?

జగ—మన మిది యంతయు యోచించుచుండు మని యాతఁ డెఱుఁగునా? రేపటియుదయమున నీవు చూచుచుండఁ గనే ప్రకాశచంద్రుఁడు వచ్చును.

హైమవతి యాహ్లాదిత యయి తండ్రికి నమస్కరించి "అప్పా! అట్లయినచోఁ గాళీమహాదేవికి రెండు కొబ్బెరకాయ లను గొట్టెదను." అనియెను.

జగచ్చంద్రుండు తన మనసులో "ఇట్లు చెప్పకున్నచో నాతల్లినగుమొగమును జూచుట యెట్లు? ఈనగుమొగమును జూడకున్నచో నీదగ్ధప్రాణము నిలిచి యుండుటెట్లు?" అని యనుకొనియెను.

భోజన మయినపిమ్మట జగచ్చంద్రునిదృష్టి ప్రభావతి పయిం బ్రసరించెను. ఆతం డాశ్చర్యపడి "ఇదేమి? ప్రభ నిద్రించు చున్నదా? మేలుకొని యున్నదా? ఆహా ! బిడ్డ నేంటియాశ నిష్ఫలమైనది." అనియెను.

హైమవతి యించుక వెనుక ముందుం జూచి "లేదు. అప్పా! ప్రభ యించుక చిన్నబిడ్డ. ఆమెకు మంచిచెడ్డ లింకను దెలియలేదు. అట్లు తెలిసినచో నట్లు పరుండునా?" అనియెను.

జగ—ఇంతటి సరళహృదయముగలబాలికహృదయమునం దెట్టి దుర్భావనయుం బుట్టంబోదు. ప్రభమనస్సునకు వ్యాకులత లేదు. నీవు పోయి నిశ్చింతముగాం బరుండుము. నేను పోయి పరుండెదను.

ఇట్లు చెప్పి జగచ్చంద్రుండు మెల్లమెల్లగ లేచి యా యాండుబిడ్డల మొగములవంకం జూచెను. ఒక్కతెముఖకమలము చిన్నదయినను బాలసూర్యునికిరణస్పర్శచేం బూర్ణముగం బ్రస్ఫుటితమయి యుండెను. మఱియొకతెముఖము పెద్దదైనను నిశాశిశిరాభిషిక్తమయి సంకుచితమయి మలినమైయుండెను.

---

## ఐదవ ప్రకరణము.

---

మఱునాఁటిప్రాతఃకాలమున నరుణోదయ మైనపిమ్మట జగచ్చంద్రుఁడు రామచరణుని వెంటఁబెట్టుకొని స్టేషనుకు వచ్చెను. యథాకాలమునకుఁ బొగబండి స్టేషనునకు వచ్చెను. కాని యాబండిలో నాతనియల్లుఁడగుప్రకాశచంద్రుఁడు లేఁడు. అప్పుడు జగచ్చంద్రుఁడు చింతాక్రాంతుఁ డయ్యెను. ఆతఁడు చాల సేపు యోచించి తుదకు గలకత్తాకుఁ దంతివార్తనంపెను. పిమ్మట వ్యసనాక్రాంతుఁడై యింటికిఁ దిరిగివచ్చెను.

పగలు పండ్రెండుగంట లయ్యెను. ఇాకను మధ్యాహ్నము తిరుగలేదు. హైమవతి తండ్రియొద్దఁ గూరుచుండి చింతామగ్నయై యుండెను. తండ్రి యామె కనేకసమాధానవచనములను జెప్పెను. కాని హైమవతిమనసు వేనికిని సమాధానపడలేదు. ఈసమయమున రామచంద్రుఁడు పరుగెత్తుకొని వచ్చి "అమ్మా! అల్లుఁడుగారు వచ్చినారు" అనిచెప్పెను.

అప్పు డాకస్మికముగా నొకయానందతరంగము పుత్రికాజనకుల హృదయములయందు భయంకరవేగమున లేచెను. ఇద్దఱును నింటినుండి యీవలికిఁ బరుగెత్తుకొని వచ్చిరి. వచ్చినతోడనే జగచ్చంద్రుఁడు తనయెదుటికివచ్చుచున్న ప్రకాశచంద్రునిఁజూచెను. ప్రకాశచంద్రుఁడు వేగముగ ముందఱికివచ్చి మామ

గారికిని వదినెకును నమస్కారము చేసెను. జగచ్చంద్రు డానందముతో నుబ్బి ప్రకాశచంద్రుని కౌఁగిలించుకొనియెను. పిమ్మట నాతనింగూర్చి "అన్నా! మార్గమందు నీకేమైన ననిష్టములు కలుగలేదుగద!" అని ప్రశ్నించెను.

ప్రకాశచంద్రుఁడు నెమ్మదిగా "భయంకరవిపత్తునఁ బడిపోయితిని. మిమ్ముల నిట్లు చూడఁగలుగుదు నని యనుకొనలేదు. కాని, యీబాలిక నాప్రాణములను రక్షించినది." అనియెను.

సంకోచములేకుండ నాబాలిక యక్కడనే నిలుచుండియుండెను. ఇంతవఱకును నెవ్వరిదృష్టియును నామెపైఁ బ్రసరింప లేదు. ఇప్పు డందఱు నాత్రముతో నాబాలికవైపునకుఁ దిరిగిచూచిరి. చూడఁగా నాబాలిక, గనినుండి తీయఁబడిన యసంస్కృతరత్నమో, కాక భస్మావృతమైన ప్రదీప్తాగ్నిరాశియో, యనునట్లుగా నుండెను. కేవలమును సామాన్యముగ వారినడుమ నిలుచుండి యామె మెల్లమెల్లగ నవ్వుచుండెను. గాలిచే నించుకచెదరినమేఘమాలిక తీక్ష్ణసూర్యకిరణము నెట్లు తేజోహీనముగాఁ జేయునో యట్లే యాబాలికమలినవస్త్రము స్వభావసిద్ధముగనున్న యామెసౌందర్యరాశిని తేజోహీనముగాఁ జేయుచుండెను. ఆశ్చర్యనిమగ్నులై యందఱును దదేకదృష్టితో నాయపూర్వసౌందర్యశాలినియగు బాలికను జూచుచుండిరి.

ప్రకాశచంద్రుఁడు సంక్షేపముగ వెనుకటిరాత్రి జరిగిన యావద్వృత్తాంతమును వర్ణించిచెప్పి "నాప్రాణమును రక్షించుటచేత నేనీమెను బందిపోటుదొంగయగు నామేనమామనుండి తప్పించి తీసికొనివచ్చితిని. మీరందఱు నీమెను విశేషాదరముతోఁ జూచికొనవలయును." అనియెను.

హైమవతి యామెవెంటనే విశ్వాసముతో నాబాలికచుబుకమును బట్టుకొని "నేఁడుమొదలు నీవు నాకుఁ జెలియలవైతివి. నీపేరేమి ?" అని యడిగెను.

అప్రయత్నముగా, హేలాళముగాఁ, బెటిగిన ముడివిడి చెదరియున్న కేశదామము వెనుకకుఁబోవునట్లుగా నాబాలికతల నల్లాడించుచు నవ్వుచునవ్వుచు "నాపే రారణ్యక" అనియెను.

జగచ్చంద్రుఁ డాశ్చర్యపడి "నేఁడుమొదలు నీవును నా బిడ్డవై యుండుము" అనియెను.

అప్పుడు ప్రకాశచంద్రుఁడు ఆరణ్యకం జూచి పెద్దలకు నమస్కారము చేయునట్లుగా సన్నజేసెను. కాని యారణ్యక యాయింగితార్థము నించుకయు గ్రహింపలేక యూరకప్రకాశచంద్రునిమొగమువంకఁ జూచుచు నిలువఁబడియుండెను. అది చూచి హైమవతి యామెచేతిని బట్టుకొని యంతఃపురమునకు దీసికొనిపోయెను. ప్రకాశచంద్రుఁడు మామగారితోఁ గూడఁ గచ్చేరీచావడిలోనికిఁ బోయి యక్కడఁ గూరుచుండెను.

అంతఃపురమున కారణ్యికను దీసికొనిపోయి హైమవతి యామెకు ముందుగా సుగంధతైలమును బూసెను. పిమ్మట నుత్తమమైన సుగంధపుఁబొడితో నలుగిడి స్నానముచేయించెను; స్నానమైనపిమ్మట నొకసొగసైన చీరను గట్టనిచ్చెను; పిమ్మట నామెను దీసికొనివచ్చి పెట్టెలోనున్న యాభరణములన్నిటిని దీసి వానితో నలంకరింపఁదొడఁగెను. ఈసమయమున హైమవతి హృదయమున నేదోయొకపూర్వస్మృతి పదింపదిగాఁ బొడసూపసాగెను. ఆకస్మికముగ హైమవతికన్నులశ్రుప్రపూర్ణములయ్యెను. హైమవతి యీయాభరణములకును, ఆమె నయనప్రాంతముల నిలిచిన యశ్రుబిందువులకును, నేదైన సంబంధ మున్నదేమో? ఆమె నిట్టూర్పును విడిచి కన్నీటిని దుడిచికొని ఆరణ్యిక వలదని మాటిమాటికి నిషేధించుచున్నను మానక యానగలనన్నిటినిఁ గ్రమముగా నామె కలంకరించెను. గనినుండి తీయఁబడిన యసంస్కృతవజ్రఖండ మిప్పుడు సంపూర్ణముగ సంస్కరింపఁబడినట్లయ్యెను. భస్మాచ్ఛాదితమైన వహ్నిరాశి యాకస్మికముగఁ బ్రదీప్తమైనట్లయ్యెను! అప్పుడా బాలికతనువల్లినుండి బయలు వెడలిన యాయపూర్వసౌందర్యరాశి యాకస్మికముగ నాయింటినంతను బ్రకాశింపఁజేసెను.

ఈసమయమునఁ బ్రకాశచంద్రుఁ డక్కడకు వచ్చెను. ప్రకాశచంద్రుఁ డప్పు డాబాలికసముజ్జ్వల సౌందర్యరాశిం

జూచి నివ్వెఱపడియెను. ఇంతలోఁ బంజరమునందు బంధింపఁ బడినచిలుక పంజరద్వారము దెఱచియున్నప్పుడెట్లెగిరి యీావలికి వచ్చునో యట్లే యారణ్యేక యెగిరివచ్చి తనరెండుచేతులను ప్రకాశచంద్రునికంఠమునకుఁ జుట్టివైచి పట్టుకొనియెను. మఱియు నాతనికిఁ దనదేహమునందున్న యలంకారములను జూపించి "నన్నెట్లుకట్టివైచిరో చూడుము! నన్నీకట్లనుండి తప్పింపుము? ఈకట్లు లేకపోయినను నేను నిన్ను విడిచి మరల నడవికిఁ బోవుదాననుగాను" అని చెప్పెను.

హైమవతి యారణ్యేకచర్యలను జూచి వెఱఁగుపడియెను. ప్రకాశచంద్రుఁడును మొదటఁ దత్తరము నొందుచు హైమవతి భావాంతరము నొందుటను గనిపెట్టెను. ఆకారణమున నాతఁడు హైమవతిం జూచి "ఈపిల్లకు సంసారజ్ఞానము లేదు. లజ్జాభయములుగాని, మానావమానములు గాని యేమియు నెఱుంగదు. కాని యీామెమనసు దేవలోకదేవకన్యకఁబోలె బవిత్రమైనది. ఇట్టిసమాజవిరుద్ధకార్యమును జూచి, యీామెయం దపవిత్రభావ మున్నదని యనుకొనరాదు" అని చెప్పెను.

పిమ్మట నాతఁ డారణ్యేకబాహువులను విడిపించుకొని "ఇందువలన నిన్ను బంధించిన ట్లెంచకుము. నిన్నాదరించి నీ సోదరి యీాయాభరణములను నీకలంకరించినది" అని చెప్పెను.

ఆరణ్యేక యించుక నవ్వి "అందుల కలంకరించినదా? ఇఁక నెందులకు? ఆదరించుట యైనది. నాశరీర మంతయు వాని

చే నొత్తుకొని పోవుచున్నది. ఇవి యన్నియుఁ దీసివేయుము" అని చెప్పెను.

ఇట్లుచెప్పి యారణ్యక మరలఁ బ్రకాశచంద్రునిపైఁ బడియెను. అదిచూచి హైమవతి యిఁక సహింపలేకపోయెను. ఆవెంటనే యామె "ఆరణ్యకా! రమ్మి. ఆభరణములను బెట్టు కొనుట నీకుఁ గష్టముగాఁ దోఁచినచో నిటురమ్మి. అవియన్ని యుఁ దీసివేసెదను" అని చెప్పెను.

ఆరణ్యక తల నల్లాడించుచుఁ బ్రకాశచంద్రుని జూచి "నీవు తీసివేయుము. ఆమె వలదు" అనియెను.

హైమవతి ప్రకాశచంద్రునిం జూచెను. ప్రకాశచంద్రుఁడు "అందువలన దోషమేమున్నది? మంచిది. నేనే నీవస్తువు లను దీసివేసెదను'' అనియెను.

ఇట్లుచెప్పి ప్రకాశచంద్రుఁ డారణ్యకమేనిపై నున్న యలంకారములను తీసెను. ఆనాఁడు భోజనమైనపిమ్మటఁ బ్రకా శచంద్రుఁడు వెలుపలి కెక్కడకో పోయెను. ఆరణ్యక యంతః పురమునం దుండెను.

ఆరణ్యక యంతఃపురమునం దస్థిరయైయుండెను. ఆమె గదిగదికిని బోయి యెవ్వరినో వెదకసాగెను. హైమవతి తన మనస్సులో "ఆమె, యింటిలో సంసారసామగ్రు లెట్లున్నవో చూచి తెలిసికొనుచున్న దని యనుకొని, యామెజోలికిఁబోవ కూరకుండెను. కాని యారణ్యకకు గృహసంసారపు గొడవ

లేమియు లేవని మనకుఁదెలియును. ఆమె మఱియొకసౌందర్య రాశిని వెదకికొనుచుఁ దిరుగాడుచుండెను. తిరుగాడుచుండఁగా నామె యొకగదిలోఁ బ్రభావతిని గాంచెను. పెనిమిటివచ్చిన మీఁదటఁ బ్రభావతి మలినయై వ్యాకులచిత్తయై యుండెను. కాని యారణ్యిక వచ్చుటతోడనే యామెవ్యసన మంతర్హిత మయ్యెను. ఇతఁలో నారణ్యికసౌందర్యమును దర్శించిన యామె కాశ్చర్యము కలిగెను. చంచలయై వెదకుచున్న యారణ్యికకుఁ బ్రభావతి కంటఁబడుటచే స్థిరభావము కలిగెను.

ఆరణ్యిక పరిపూర్ణయౌవన. గౌరాంగి. ఆమెప్రత్యవయవమును బరిపూర్ణాభివృద్ధినంది యుండెను. కాని, ప్రభావతి యౌవనోన్ముఖయై, శ్యామాంగియై యుండెను. ఆమెయవయవములింకను బ్రపూర్ణతను బొందియుండలేదు. అందువలనఁ బ్రభావతి వచ్చి యారణ్యికచేతిని బట్టుకొన్నప్పుడు గంగాయమునల సంగమమువలెఁ గానఁబడియెను.

ప్రభా—నీవయసెంత ?

ఆర—అది నాకుఁ దెలియదు.

ప్రభా—మంచిది—నీకుఁ దెలియకుండ నుండవచ్చును. కాని నీవు నాకంటెఁ బెద్దదానవే యగుదువు. నేను నిన్ను "అక్కా !" యని పిలిచెదను.

ఆర—నాకిక్కడ మఱియొకయక్క యున్నది. నేను, అక్కనైనచో నేమి చేయవలయును ?

ప్రభా—అక్కయైనచోఁ జెల్లెలిని బాగుగఁ బ్రేమింపవలయును. నీవు నన్నుఁ బ్రేమించుచుంటివా ?

ఆరణ్యక యించుకసే పూరకుండి "ప్రేమించుచుంటిని" అనిచెప్పి మరల నూరకుండెను. పిమ్మట "ప్రేమించుట కేమి చేయవలయును ?" అనియెను.

ప్రభావతికిఁ జిక్కువచ్చెను. ప్రేమించుట కేమిచేయవలయునో తెలుపుటయెట్లు ? ఆమె యించుకసేపు యోచించి "నీకెవ్వరును లేరా ? నీవెవ్వరిని బ్రేమించుటయే లేదా?" అనియడిగెను.

ఆర—నాకుఁ దండ్రియొకఁడుమాత్ర ముండెను.

ప్రభా—మఱియెవ్వరును లేరా ?

ఆర—మఱియు, నన్నిక్కడకుఁ దీసికొనివచ్చిన యాతఁడున్నాఁడు.

ప్రభావతి నవ్వుచు "నిన్నిక్కడకుఁ దీసికొనివచ్చిన యాతనిఁ బ్రేమించుచుంటివా ?" అనియెను.

ఆర—అది నాకుఁ దెలియదు.

ప్రభా—మంచిది. నీవు మాయింటియం దుందువా ?

ఆర—ఉండెదను.

ప్రభా—నీతండ్రికొఱకు నీమనసు తల్లడింపదా ?

ఆర—నన్నుఁ దీసికొనివచ్చిన యాతనితో నున్నచోఁ నాతండ్రిని జూడవలయునను నభిలాష గలుగదు.

ప్రభావతి మరల నవ్వి "మంచిది. నీవు నాతో నుండు ము." అని చెప్పెను.

ఆర—ఉండెదను. కాని, యాతఁడు నుండునా ?

ప్రభా—ఆతఁ డెవ్వరు ?

ఆర—తెలియదా ?—నన్నిక్కడకుఁ దీసికొనివచ్చిన యాతఁడు—

ప్రభావతి యధరప్రాంతమునుండి మరల నానగవు పోయెను. నోటినుండి మాటయును వచ్చుటలేదు. ఆమె విస్మితనేత్రయై కేవల మారణ్యేకముఖమును జూచుచుండెను.

---

ఆఱవప్రకరణము.

రాత్రి పదిగంటలవేళఁ బ్రకాశచంద్రుఁడు శయనమందిరమునకుఁ బోయెను. పోయిచూచునరి కాతనిభార్య ప్రభావతి ముసుఁగుపెట్టుకొని ప్రక్కపై నొకమూలఁ బరుండియుండెను. ప్రకాశచంద్రుఁడు పోయి యామెప్రక్కను బరుండెను. ఆమెయే మొదట మాటాడవలయు నని యాతఁడు చాలసేపు నిరీక్షించెను. కాని యామెశరీరమును గదపినశబ్దమైన వినఁబడ

లేను. రాత్రి చాలసేపయ్యెను. ఆతఁ డిఁక సహింపఁజాలక మెల్ల మెల్లగ "ప్రభా" యని పిలిచెను.

ఎట్టి ప్రత్యుత్తరమును రాలేదు. మరల "ప్రభా!" యని పిలిచెను. మొదటివలెనే నిరుత్తరుఁడయ్యెను. ఇట్లనేకప ర్యాయములు పిలిచెను. ప్రత్యుత్తర మేమియుం బయలుదేఱ లేదు. అట్లయినచోఁ బ్రభావతి నిద్రించుచున్నదా? నిశ్వాస ప్రశ్వాస శబ్దములవలన నాలక్షణము లేవియు నగపడుట లేదు. ప్రకాశచంద్రుఁ డిఁక నూరకుండఁజాలక శయ్యపైనొక పార్శ్వ మునఁ బరుండియున్న ప్రభావతియొద్దకు మెల్లమెల్లగ జరగి పోయి యామెశరీరమును స్పృశించెను. కాని యిదియేమి? ప్రభావతి జీవించి యున్నదా? కాక మృతిఁజెందియున్నదా? జీవములతోనున్న శరీరమున కింతటికాఠిన్య మెందులకు? మృత దేహమున కింతటి శక్తి యెక్కడనుండి వచ్చినది?

ఆతఁడు మెల్లమెల్లగ నామెశరీరమును గదపెను. అంగ చాలనమువలనఁ బ్రాణములున్నలక్షణ మగపడియెను. శరీర మును గదపుచు మాటిమాటికి "ప్రభావతీ!" అని పిలువ నా రంభించెను.

ఎన్నియోసారులు పిలిచినపిమ్మట నతిక్షీణమైన యస్ఫు టస్వరముతో "ఏమి?" అను నుత్తరము వెడలెను.

ప్రకాశచంద్రుఁడు "నీకు నిద్రపట్టినదా?" అని య డిగెను.

మరలఁ బ్రత్యుత్తరము రాలేదు. అప్పుడు మరల నామెను గదపి "ప్రభావతీ! ప్రభా!" అను నాదరసూచకసంబోధనములతోఁ బిలిచెను. అయినను బ్రత్యుత్తరము రాలేదు. తుదకు బ్రకాశచంద్రుఁడు విసిఁగి "ఇఁక మాటలాడక పోయినచో నే నిక్కడనుండి వెడలిపోయెదను." అని చెప్పెను.

పిమ్మట మరల నామెశరీరమును గదపి "ప్రభావతీ!" అని పిలిచెను.

మొదటిపలెనే యాక్షీణస్వరముతో "ఏమి?" అను శబ్దము వెడలెను.

ప్రకాశచంద్రుఁ డాత్రముతో "ఇన్నిదినములైనపిమ్మట నేను నిన్నుఁ జూచుటకు రాఁగా నాతో మాటలాడవలదా? అప్పుడు చిన్నపిల్లవై యుంటివి. ఇప్పు డాచిన్నతనము పోయినది. మాటాడుశక్తి వచ్చినది. నామీఁదనొట్టు—మాట్లాడుము ప్రభా!" అనియెను.

ఎట్టిప్రత్యుత్తరమును లేదు. ప్రకాశచంద్రుడు చాల నస్థిరుఁ డయ్యెను. విరసమువలనఁ గలిగిన దారుణయాతనచే నాతఁడు మిగుల వ్యాకులచిత్తుఁ డయ్యెను. ఏమిచేయవలయునో యేమియు నాతనికిఁ దెలియలేదు. చాలసేపు యోచించుచు నూరకుండెను. అప్పు డశ్లొతనే పూరకుండనగునా? ఈసారి కరుణరసోద్దీపకస్వరముతో "నేను నీయెడ నెట్టి యపరాధమును

గావించియుండలేదు. ఇట్టిచో నాకెందుల కింతటియాతనగలి గించెదవు ?" అనియెను.

ప్రభావతి యప్పుడును "ఏమి ?" అను నుత్తరము నిచ్చెను.

ప్రకాశచంద్రుఁడు తనమనసున "ఏమి ?" మరల నాకి కక్కుమాలిన "ఏమి" యా ? మాటిమాటికి నదే. "ఏమి"యా? ఇంకేమియును మాటలేదా ? మఱియొకమాట యామెకుఁ దెలియదా ?" అని ఆలోచించుచుండెను.

ఇంతలోఁ బ్రభాతము కావచ్చెను. అప్పుడు ప్రకాశ చంద్రుఁ డుద్విగ్నమనస్కుఁడై తలుపులు తెఱచుకొని వెలుప లికివచ్చెను. ద్వారము నొద్దకు వచ్చినతోడనే యిదేమియవాం తరము ! వేటకాఁ డెదుటఁబడినతోడనే కాచికొనియున్న పులి యొకగంతులో వచ్చి యాతనిపైఁబడిన ట్లారణ్యక ప్రకాశ చంద్రు నెట్టయెదుటఁ జూచినతోడనే వచ్చి యాతనిపైఁ బడి యెను. ప్రకాశచంద్రుఁడు మెల్లమెల్లగ నుద్విగ్నమైయున్న తనచిత్తమును స్థిరపఱచుకొని, ఆరణ్యకయాలింగనమునుండి తనశరీరమును విడిపించుకొనియెను. కాని, యీసంఘటనము గోప్యముగా నిలువలేదు. స్వల్పదూరమునం దొకస్త్రీ నిలు చుండి చూచుచుండెను. ఆమెయెవ్వరు ? మఱెవ్వరునుగారు ! ప్రభావతియక్కయగు హైమవతియే.

---

## ఏడవ ప్రకరణము.



ఈవిధముగా రెండువారములు గడచిపోయెను. ప్రకాశచంద్రుఁ డెంతప్రయత్నించియుఁ బ్రభావతిమనసును ద్రిప్పలేకపోయెను. ఇది యిటుండ నారణ్యకచర్యలచేఁ గ్రమముగా నాతని మనసునకు విసుఁగు పుట్టుచుండెను. ఒకవైపునఁ బ్రభావతితిరస్కారము—మఱియొకవైపున నారణ్యకయాకర్షణము. ఈ రెంటినడుమను బ్రకాశచంద్రుఁడు మునిఁగి తేలుచుండెను. ప్రకాశచంద్రుని వేయియనునయవచనములకు నొక్క "యేమి?" యనునదియే యుత్తరముగా నుండెను. ఇఁక వేఱుమాటయె లేదు. రెండువారములైనపిమ్మటఁ బ్రభావతి విసిఁగి వేసారి యొకటిరెండుమాట లాడనారంభించెను. అవియైన నేమిమాటలు? "నాకు నిద్రవచ్చుచున్నది" కాక, "నాకిదేమి గందరగోళము ?" కాక "నాకు విసుఁగుగానున్నది" "నన్నెందులకుఁ బీడించెదరు?" అనునిట్టి యొకటిరెండుమాటల నాడుచుండెను.

ప్రకాశచంద్రుఁడు మిగుల మర్మాంతికయాతనను లోనయ్యెను. ఆతనియాశ యంతయు నిష్ఫలమై పోయెను. నిరాశ యాతనిహృదయమును దహించివేయుచుండెను. భార్యమనస్సు నెట్లు త్రిప్పవలయునో దానిని స్థిరీకరింపలేకపోయెను. ఈవిధముగా నొకమాసము జరిగిపోయెను. ఒకటిరెండునెలలైనపిమ్మ

ట ప్రభావతిముఖ మింమక వికసించిన ట్లగపడియెను. కాని, యేమైన నడిగినచో విన నసహ్యములగు విసువుపుట్టించు మాట లాడుచుండెడిది. ఆమెమాటలు మర్మాంతికములై మిగులభారము గలిగించుచుండెను. ఆతఁ డెన్నోవిధముల నాదరవచనము లాడుచుండెను. వానికి బదులుగ నామెనోటినుండి వెలువడిన యీయమృతమయవాక్యపరంపర యాతని మనస్సునకు విష ముసోకిన ట్లగుచుండెను. ఒకనాటిరాత్రి వారిరువురకును జరిగిన సంభాషణమునుగూర్చి చెప్పుచున్నాము-వినుఁడు.

ప్రభావతి మునుపటివలెనే శయ్యపైఁ జిట్టచివరఁబరుండి యుండెను. ప్రకాశచంద్రుఁడు వచ్చి యామె వెనుకఁబరుండెను. మేనికిమేను సోఁకెను. ప్రభావతి సిగ్గుచు మఱికొంత జరగెను. ఇంకొకసారి ప్రభావతి జరగినచో నామె మంచముగుండి క్రిం దికిఁ బడవలసినదే. అది కనిపెట్టి ప్రకాశచంద్రుఁ డిఁక జరగ లేదు. ఆతఁడు కొంచెమునే పూరకుండి పిమ్మట "ప్రభా!" అని పిలిచెను.

ప్రభావతి వెంటనే "ఏమి" అను నుత్తరమిచ్చెను.

ప్రకాశచంద్రుఁ డాగ్రహముతో "నీవు నాతో నెందు లకు మాటాడుటలేదు" అని యడిగెను.

ప్రభా—ఏమిమాటాడను ?

ప్రకా—ఏమిమాటయో నేను చెప్పవలయునా ?

ప్రభా—నాకది తెలియదు.

ఇంచుకసే పూరకుండి ప్రకాశచంద్రుఁడు "నే నొకమాట యడుగుచున్నాను. నిజము చెప్పెదవా ?" అనియెను.

ప్రభా—ఏమిమాట ?

ప్రకా—నన్నుఁ బ్రేమించుచుంటివా లేదా ? సత్యము చెప్పుము.

ప్రభావతి మ్లానవదన కాకయే, " నేను ప్రేమించుట లేదు." అనియెను.

ప్రకాశచంద్రుని హృదయమునందు, ఆకాశమునుండి మేఘములేకుండఁగనే పిడుగు పడినట్లయ్యెను! ప్రకాశచంద్రుఁడు మరలఁ జాలసేపూరకుండి యొకనిట్టూర్పు విడిచి " నేను నీకు భర్తను—నేను నిన్ను మిగులఁ బ్రేమించుచున్నాను. నీవు నన్నెంచుటకుఁ బ్రేమించుట లేదు ? ఇది నీకుఁ దగునా ?" అనియెను.

ప్రభా—అది నాకుఁ దెలియదు.

ప్రకా—నే నిన్నాళ్ళవఱకు రాకుండనుండుట నీకుఁ గష్టముగాఁ దోఁచలేదా ?

ప్రభా—లేదు.

ప్రకా—భర్తను బ్రేమింపవలయు ననుసంగతి నీకుఁ దెలియదా ?

ప్రభా—అది నాకుఁ దెలియును.

ప్రకా—అట్లయినచోఁ బ్రేమించుట లేదేమి ?

ప్రభా—అది నాకుఁ దెలియును.

ప్రకా—ఇఁక నొకమాట చెప్పుచున్నాను. మనము చాలకాలము వేఱుగా నుంటిమి. ఈ నడుమ నొకముహూర్త కాలపర్యంతమైన నేను నీకు జ్ఞప్తికిరాలేదా ?

ప్రభా—లేదు.

మరల నదే "లేదు!"—ఈ ప్రశ్నమునకును నదే—లేదు—అనునుత్తరమేనా? ప్రభావతి యిచ్చుచున్న ప్రత్యుత్తరములన్నియు నిజమైనవియేనా ? ప్రకాశచంద్రునిహృదయమునం దొకేకాలమునందు వేయితేళ్లుగుట్టినంత యాతన కలుగ నారంభించెను. ఆతఁడు మరలఁ బ్రశ్నింపలేదు. ఏమియో యోచించుకొని యేడువ నారంభించెను. ఆయేడుపు శబ్దము లేనిదైనను, ప్రభావతి దాని నవశ్యమును దెలిసికొనఁగలదు. అయినను నామె యావైపునకుఁ దిరుగలేదు. కొంచెముసేపయిన పిమ్మట ప్రకాశచంద్రుఁ డించుక స్వస్థచిత్తుఁడై, కరుణాస్వరముతో "నీవిఁక నిజమైనసంగతి చెప్పవలసినపని లేదు. ఇప్పుడొకసారి యసత్యముచెప్పుము—నిన్ను నేను ప్రేమించుచున్నానని యసత్యము నయినను చెప్పుము." అనియెను.

ప్రభావతి యీసారి యెట్టి ప్రత్యుత్తరమును నీయలేదు. ప్రకాశుఁడు మరలమరల నడుగ నారంభించెను. అప్పుడు

ప్రభావతి విసుగుఁజెంది గర్జించుచు "ఇదేమికడుపుమంట !— నన్ను నిద్రపోనిచ్చుట లేదేమి ?" అనియెను.

ప్రకాశచంద్రుఁ డూరకుండెను. అతనిప్రయత్నమంతయు వ్యర్థమయ్యెను. ఆతనిహృదయ మాచింతాగ్నిచే దగ్ధమగుచుండెను. ఇంతలోఁ బ్రభావతి గాఢనిద్రానిమగ్న యయ్యెను. ఆమె దీర్ఘమైనయొకనిట్టూర్పును విడిచెను. అది యాతనిచెవిలోఁ బడియెను. అప్పు డాతనిదృష్టి యామెవైపునకుఁ బ్రసరించెను. ఆతనిహృదయయాతనకుఁ బారమే లేకుండఁబోయెను. నిద్రానిమగ్నయైన తనభార్య, యొక్కొక్కనిశ్వాసము నాతనిహృదయమునకు శూలమయి నాటుచుండెను. ఆతఁడు యాతనతో రాత్రియంతయుఁ బ్రక్కపై బొరలుచుండెను. ప్రకాశచంద్రుని యీవిధమగు దుస్సహయాతనతో రాత్రి జరిగిపోయెను. కాని ప్రభావతికి మెలఁకువ రాలేదు. ప్రకాశచంద్రుఁ డరుణోదయమునకు ముందుగనే శయనగృహమునుండి వెలుపలికివచ్చెను ; ద్వారము తెఱచుకొని యీవలికి వచ్చినతోడనే స్వల్పదూరములో నారణ్యైకను జూచెను. ఆకస్మికముగ నెక్కడనుండియో యొకజలప్రవాహము వచ్చి మున్నుగ్రామము, నగరము, వనము, ఉపవనము, పశువు, పక్షి, గృహము, వృక్షము, లత మొదలగువానినెల్ల నెట్లు తేలవైచుకొనిపోవునో, యట్లేయొక్క నిమిషములో నున్మాదినియగు నాయారణ్యైక వచ్చి ప్రకాశచంద్రుని తేలఁగొట్టుకొని పోవుటకై యుపక్రమించెను. బహుశఃప్ర

యత్నముతోఁ బ్రకాశచంద్రుఁ డాయారణ్యకయాక్రమణము నుండి తప్పించుకొనియెను. సమీపమునందు నిలుచుండి చూచు చున్న హైమవతి రోషకషాయితనేత్రయై యాకస్మికముగ "ఆరణ్యకా!" అని కేకవైచెను.

ఆధ్వనినివిని ప్రకాశచంద్రుఁ డారణ్యకను గెంటివైచి వేగముగ నక్కడనుండి వెడలిపోయెను. ఆరణ్యక తానుపడినపాటును లక్ష్యపెట్టక యతివేగముగఁ బ్రకాశచంద్రుఁడు పోవుచున్న వైపునకుఁ బరువెత్తుకొని పోసాగెను. ఇంతలో హైమవతి క్రోధముతోఁ బరువెత్తుకొనివచ్చి చేతికిదొరకిన యారణ్యకచికురజాలమును బట్టుకొనియెను. స్వల్పదూరములోఁ బల్లెరమునందున్న యన్నమునుజూచి స్తంభమునకుఁగట్టువడి యాఁకలితోనున్న కుక్క యజమానునిముఖము నెట్లుచూచుచుండునో యట్లే యారణ్యక హైమవతిముఖమునుజూచుచు నిలువఁబడిపోయెను.

---

## ఎనిమిదవప్రకరణము.

---

ఆకర్ణవిస్తృతములయి యర్ధవిస్ఫారితములైన కన్నులు గల యీమోహినీశక్తి యెంతటిదో మేము చెప్పఁ జాలము. ఆశక్తికృతకార్యమును జూచినచో నిశ్చేష్టతకలుగును. ఆరణ్యక

చికురజాలమునుబట్టుకొని క్రోధముతోఁ గంపించుచున్న హైమవతి దృఢముష్టి విశాలనేత్రములయందలియామోహనదృష్టిచేఁ గ్రమముగా సడలిపోఁజొచ్చెను. హైమవతి యారణ్యక చికురమును బట్టుకొనినపట్టును మెల్లమెల్లగా విడిచివైచెను. పిమ్మట నామెచేతినిఁ బట్టుకొని తనగదిలోనికిఁ దీసికొనిపోయెను. ఆమె యారణ్యక చేయుచున్న యిట్టియన్యాయాచరణముల నెన్నిటినో సహించి యుండెను. అట్టిసహనగుణముచేఁ జిరప్రఫుల్లమయిన యాహైమవతిముఖకమల మప్పు డారక్తిమమై గభీరభావము నెందులకుఁ దాల్పవలయును? ఇన్నాళ్ళు నింకొకొ ఆకే యామె, యారణ్యకను గద్దించుటలేదు. ఇన్నాళ్ళును సంసారజ్ఞానము లేని యిట్టిచర్యనుగూర్చి యనుమానమును బొందుచున్నను, నుపేక్షించుచుండెడిది. కాని, నేఁడు జరిగిన దంతయుఁ దనకన్నులఁజూచి యిఁక నిశ్చింతయయి యుండలేకపోయెను. ఇట్టిచర్య యిఁకముం దుపేక్షణీయమయినదిగాఁ గనఁబడలేదు. ఆకారణమున నామెసహనగుణము హద్దుమీఱిపోయెను. ఆకారణమున నేఁడు బాగుగఁ జీవాట్లుపెట్టి బుద్ధి చెప్పవలయునని హైమవతి యారణ్యక నెవ్వరునులేని తన గదిలోనికిఁ దీసికొనిపోయెను. లోనికిఁ దీసికొనిపోయి తలుపులుమూసి లోపలగడియ వైచెను. ఆమె యారణ్యకను గూర్చుండఁబెట్టుకొని కర్కశస్వరముతో "నీగందరగోళము

చాల హెచ్చుగానున్నది. నీకు ధర్మాధర్మజ్ఞానము లేదా?" అని యడిగెను.

ఆరణ్యైక యొకసారిమాత్రము హైమవతిముఖమును దృష్టించిచూచి నిర్భీకహృదయయై "నేనేమి యధర్మముచేసితిని" అని యడిగెను.

ఆరణ్యైక యీయొక్కమాటచే హైమవతికోప మెక్కడకోపోయెను; కోపమునకుమాఱుగా నాశ్చర్యము కలిగెను. హైమవతి తనకర్కశస్వరమునకుఁ బ్రతిగా విస్మితస్వరముతో "అందుదాని కింతకంటెను నధర్మమైనది లేదు." అనియెను.

ఆర—ఏకార్యమునుచేసినచో మనస్సునం దొకయాతన కలుగుచున్నదో యట్టికార్య మధర్మమైనదని యెఱుఁగుదును. అట్టియధర్మకార్యమును జేసినచోఁ బాపపుఁబని చేసినట్లగును.

హైమ—నీవు చేసినపనివలన నీకు మనసులో వ్యథ కలుగ లేదా ?

ఆర—వ్యథ కలుగ లేదు. విశేషించి యానందమే కలుగుచున్నది.

ఈమాటనువిని హైమవతి యొక్కసారిగా విస్మయసాగరమున మునిఁగిపోయెను. ఆవిస్మయముతోఁ దిరస్కారమును మిశ్రితమయ్యెను. ఆమె తిరస్కారముతోఁ గూడినహాసస్వరముతో "నీమొగమునకు నిప్పుపెట్ట ! నీయానందము తగు

లఁ బెట్టు! నీవాఁడుదానవై యుండి పరపురుషుని దురభిప్రాయ ముతోఁ జూచినచో మహాపాతకమని గుర్తెఱుఁగవా?'' అని యెను.

ఆరణ్యక హైమవతిచెప్పిన మాటలను వినియెను. ఆ మాటలవలన నామెయాంతరిక బాహ్యాభావములయం దేమి యుఁ బరివర్తనము కాలేదు. ఆమె కేవల మొకేదృష్టితో హైమవతిముఖమును జూచుచు నించుకనవ్వుచు "అక్కా! పరపురుషుఁ డనగా నెవ్వరు?" అని యడిగెను.

ఈదృష్టి—ఈనగవు—వీనిచే హైమవతి యాశ్చర్యతిరస్కారము లెక్కడనో యదృశ్యములయ్యెను. కారుమబ్బుచే మూసికొనిపోయిన యాకాశము ప్రచండమారుతముచే నొక నిమిషములో మేఘశూన్యమైన ట్లయ్యెను. హైమవతి యప్పుడు స్నేహవిశ్వాసములతో "మంచిది. దానిని నీకు బాగుగఁ దెలియఁ జెప్పెదను. వినుము. పెండ్లియనఁగాఁ తెలియునా ?'' అని యడిగెను.

హైమవతీ ! ఇంత తిరస్కారమును దర్జనభర్జనము నెందులకు ?

ఆర—వినియుంటిని—కాని,—దేనినిఁ బెండ్లి యందురో యది తెలియదు.

హైమ—ఇప్పుడు వినుము. ప్రపంచమునం దనేకపురుషులును, అనేకస్త్రీలును నున్నారు. వారివారినడుమ ధర్మసా

ష్టిగా నెవరెవరికి సమ్మేళన మగుచున్నదో అట్టిపురుషుని కా స్త్రీ పెండ్లియైనయామె యని చెప్పవలయును. ఇట్టిచేరికను మా దేశమునందు దలిదండ్రులే వెదకి చేయుదురు.

ఆర—నాతల్లిని నే నెప్పుడును జూడలేదు. తండ్రిని మరల నేను చూచునట్లులేదు. ఆనాచేరిక నెవ్వరు చేయవలయును ?

హైమవతి యధరోష్ఠములయం దించుక చిఱునగ వగపడియెను. ఆమె యానగవు లగపఱుపక యె, "తల్లిదండ్రులు లేనిచో స్వజనులైనవా రెవ్వరైన నాచేరికను గలిగించెదరు. నీవు నాకుఁ జెల్లెలవు—నేనే యాచేరికను జేయుదును" అని చెప్పెను.

అప్పు డారణ్యైక యమ్లానవదనయై నవ్వుచు "అట్లయినచోఁ జేయుము!'' అనియెను.

హైమవతి విస్మితనేత్రములతో నాలజ్జాహీనమైన ముఖమును జూచుచు "ఎవ్వరితో నీచేరికను గలిగింపవలయును ?" అని యడిగెను.

ఆరణ్యైక మునుపటివలెనే యమ్లానవదనయై నిర్లజ్జాభావముతో నవ్వుచునవ్వుచు "ప్రకాశచంద్రునితో—'' అనియెను.

హైమవతి యామె నించుక దృష్టించిచూచి "అట్లయినచో నీ వాతని బ్రేమించుచుంటివా?'' అని యడిగెను.

ఆరణ్యైక తలనల్లాడించుచు "ప్రేమించుచుండుటయనగా నేమో నాకుఁ దెలియదు." అనియెను.

హైమ—మంచిది. నీ వెప్పుడు నాతనిఁ జూడవలయునను నాశగలదానవై యాతనితోడనే యెప్పుడు నుండవలయునను నిష్టము గలిగియున్నావా ?

ఆర—అవును. అక్కా! అట్లే. ఆతని జూడకున్నచో నామనసుకుఁ జాలఁ గష్టముగానుండును. ఆతనిజూచినచో నా వెంటనే యాతనిని జుట్టఁ బెట్టుకొనవలయుననునిష్టము గలుగుచుండును.

హైమవతి యిట్లనఁకి "అట్లయినచో నీవు చచ్చుట యే మంచిది. ఇటు చూడుము! ప్రకాశునకుఁ బ్రభావతితోఁ బెండ్లియైనది. మరల నిన్నిచ్చి యాతనికిఁ బెండ్లి చేయఁబోరు. నేను మొదట, నెవ్వనితో నేస్త్రీకిఁ జేరికగలుగునో యాపురుషుఁడు తక్కఁ దక్కిన పురుషులందఱు నామెకుఁ బరపురుషులని చెప్పితినిగదా? అట్లే నీపక్షమునకుఁ బ్రకాశచంద్రుఁడు పరపురుషుఁడైనాఁడు. ప్రకాశచంద్రుని నీమనస్సునఁ జింతించుచుండుట మహాపాతకమగును" అనియెను.

ఆరణ్యైకనోటినుండి మరల మాటరాలేదు. ఆమె తనవి తీరునట్లుగాఁ గన్నులు తెఱచి, కనుగ్రుడ్డులను ద్రిప్పుచు, గనురెప్పలు మూయకయె, కన్నుల కలసట లేకుండ హైమవతినిఁ జూచుచుండెను. హైమవతి యాకనుచూపులకర్థమును గ్రహిం

చినదో లేదో మనకుఁ దెలియదు. ఆమె యీవిధముగాఁ జెప్పఁ దొడఁగెను—“ఆరణ్యకా! నీవు మాయింటికి వచ్చుటచేత మేమెట్లయిన నొకవరుని వెదకి నీకుఁ బెండ్లిచేసెదము” అని చెప్పెను.

ఆర—నేను మఱెవ్వనిని బెండ్లియాడఁబోను.

హైమ—ఆతఁడు ప్రకాశచంద్రునికంటెను సుందరుఁడై యున్న యెడల ?

ఆర—ప్రకాశచంద్రునికంటెను సుందరుఁడా! అట్లయి యుండదు. ఎప్పటికి నట్లుండదు.

హైమ—ఉన్న యెడల ?

ఆర—అట్టివానిని పెండ్లిచేసికొనఁబోను.

హైమ—నెఱవేఱనియాశ నెందులకుఁ బెట్టుకొందువు?

ఆర—ఎందుకాశపడుచుంటినో నేనెఱుఁగను.

హైమ—అట్లయినచో నీనుదుటఁ బెండ్లివ్రాయలేదు.

ఆర—వ్రాయకపోయినచో వలదు.

హైమ—నీ విట్లే పెండ్లిలేకుండ ముసలిదానవైనచో నందఱును మమ్ము నిందింతురు. అందువలన నీదుఃఖమునకుఁ బారముండదు. చూడుము బిడ్డా! నీచిరజీవితమునందలి సుఖమును బోగొట్టుకొనుట యెందులకు? నామాట వినుము. అంతటియాశను మనసునందుఁ జోటీయకుము. మేము మంచి

వరుని వెదకి పెండ్లిచేసి నీకు సుఖమును గలిగించెదము.” అనియెను.

ఆర—మీ సుఖమనునదియు, మీదుఃఖమనునదియు నాకుఁ దెలియదు. నేనేమి తెలిసికొంటిననఁగా—నాప్రాణము దేనినిష్టపడునో యదే సుఖమనియు, దేనినిష్టపడదో యదే దుఃఖమనియుఁ దెలిసికొనియున్నాను.

హైమ—ప్రాణ మనేకసమయములయందుఁ బాపకార్యములు చేయుటకై యత్నించుచుండును. ఆపాపకార్యమును జేసినచో మనస్సునకు సుఖ ముండునా?

ఆర—అక్కా! నేను మొదటనే నీకుఁ జెప్పియుంటిని. నే నెప్పటికిని బాపకార్యములు చేయఁబోను.

హైమ—ప్రకాశచంద్రుఁడు నీకు భర్త కాఁడు. ఇట్లున్నప్పు డాతని నీవు ప్రేమించినచో నది పాపకార్యము కాదని నీ కెవ్వరు చెప్పినారు?

ఆర—నామనసు చెప్పుచున్నది.

హైమవతి యుత్తేజితస్వరముతో “నీమనసుమండ బెట్ట! నీకింతటిమనస్సున్నచో, దానితో నెక్కడికైనఁబోయి యురి పెట్టుకొని చావుము” అనియెను.

ఆరణ్యేకచిరప్రఫుల్లమైనముఖ మీమాట వినినతోడనే గంభీరభావమును ధరించెను. చూచుచుండఁగనే రెండు

కన్నీటిబిందువు లామెగండస్థలములమీఁదఁ బడియెను. ఆమె కన్నులు తుడుచుకొని "అక్కా! అట్లయినచో నీకమీఁద నే నిక్కడ మీతో నుండఁజాలను. మీయూరు, ఇండ్లు మొదలగు వానికంటె మాయరణ్యమే వేయిరెట్లు బాగుగ నున్నది" అనియెను.

ఆరణ్యైక నయనప్రాంతములకువచ్చిన యశ్రుబిందువు లను జూచి హైమవతిప్రాణము సహానుభూతిచేఁ గరఁగిపోయె ను. ఆమె నేవిధముగా నెంతగా భర్జనముచేయదలంచుకొన్న దో యదియంతయు హైమవతి మఱచిపోయెను. అప్పు డామె యారణ్యైకదుఃఖమునందు దుఃఖితయై కన్నీరు విడువనారంభించె ను. విశేషముగా నారణ్యైక తమ్మువిడిచి యడవికిఁ దిరిగిపోవు టకై యిష్టపడుచుండుటను విని హైమవతిమనసులో నారణ్యై కపైఁ జాలఁగోపమే కలిగెను. కాని, యాకన్నులనుండి బిందు మాత్రమైన యశ్రువును జూచినచో నెందులకో హైమవతి హృదయము మిగుల వ్యథిత మగుచుండెను. ఆరణ్యైక తమ్మును విడిచివైచి వెడలిపోవునని మనస్సునకు దోఁచిననిమిషముననే హైమవతి కన్నులనుండి తమంతన ధారగా నశ్రువులుగురియనా రంభించెను. ఆకారణమున నారణ్యైక చెప్పినమాటలనువిని హైమవతి యేడువసాగెను. పిమ్మట నించుక సమాధానపఱ చుకొని హైమవతి "నీవు మాయింటిని వదలి యెక్కడకుఁ బో యెదవు? నీకెక్కడక్కడఁ దిరుగుట కెంతో యాశ యని చెప్పి

యుంటివి. శేయుంబన లెక్కడనైనఁ దిరుగుము. ఏమియు న భ్యంతరములేదు. ఇప్పు డీమాటలెల్ల నటుంచుము. కొన్నినాళ్లు నీవిక్కడనే యుండుట మంచిది. నేనేమైనఁ జెడ్డమాటలాడి నచో మఱచిపొమ్ము.'' అని చెప్పెను.

ఇప్పటినుండియుఁ జిరప్రఫుల్లమైన యారణ్యేకమనస్సు నం దాకస్మికముగ నొకవిషాదతరంగము లేవఁదొడఁగెను. నిర్మలాకాశమున నసంఖ్యాకములైన నక్షత్రములతోఁగూడిన పూర్ణచంద్రుఁడు సువర్ణమయజ్యోత్స్నతో నింతవఱకును నాలు దిక్కులను బ్రకాశింపఁ జేయుచుండెను. ఆకస్మికముగ నాపూ ర్ణచంద్రుఁడు రాహుగ్రస్తుఁడైనచో, అసంఖ్యాకములైన తా రకలక్షీణకాంతివలన నేమగు ? పూర్ణచంద్రాభావముచే నలు దెసలఁ జీఁకటు లెట్లావరించుకొనునో, యట్లే, నేఁడు జరగిన విద్యమానములచే నారణ్యేకహృదయ మంధకారావృతమైపో యెను. ఆచంచలగతి క్రమముగా మందము గాఁజొచ్చెను. ఖం జనదృష్టివలెఁ జంచలమైయున్నదృష్టి క్రమముగా నిమ్నోన్ము ఖమగుచుండెను. ఆమెయందున్న శంకాన్యమనస్కభావ మిం చించుక దలసూపుచుండెను. ఇన్నిదినములైనపిమ్మట నామె బాల్యకాల మీాజన్మమునందుఁ గడపటియనుజ్ఞగైకొని విడిచి పోయెను. దానితావున విషమసంకటాపన్నమైన యావనకా లము మెల్లమెల్లగఁ గాలూని నిలువసాగెను. పగలు జరిగిపోయె ను. దానితావున గాఢతరమైనసంధ్యాచ్ఛాయ యధికారము

చేయనారంభించెను. ఈసంధ్య జరగిపోయినపిమ్మటఁ బగలు మరల రాదాయేమి?

---

తొమ్మిదవ ప్రకరణము.

---

హైమవతికి రెండువైపులను జిక్కు సంప్రాప్తమయ్యెను. వ్యాకులతచే మలినమైన యారణ్యకముఖమును జూచిన తోడనే యామె కేమోగాని మనస్సునఁ జాలఁగష్టము బోధ యగుచుండెను. మఱియు నామె, తనప్రాణసమానయగు ప్రభావతివిషయమున నెట్లగుచుండెనో మేమేమి చెప్పఁగలము? ప్రభావతివిషణ్ణముఖమును జూచినతోడనే యామెప్రాణము కొట్టుకొని వెలుపలికి రాకుండునా? ఆమె తనయాదరమునకుఁ బాత్రురాలైన ప్రభావతిదుఃఖమునుగూర్చి యోచించుకొన్నప్పుడు పొంగిపొరలుచున్న కన్నీటి నాపలేకుండెను. ఒకతె కైవ్యాదిసుఖదాయకమై యున్నదో యది మఱియొకతెకు దుఃఖకారణమై యుండెను. అందువలన హైమవతికి రెండువైపులను జిక్కు సంప్రాప్తమయ్యె నని చెప్పితిమి.

కాని యారణ్యక హైమవతి కెవ్వరు? వారికి వారికి నేమి సంబాధమున్నది? ఆమె యీయింటికి వచ్చి కొన్నిదినములు మాత్రమే యయ్యెను. అంతమాత్రమున నామెకొఱకు

హైమవతి యేడ్చుట యెందులకు? అదియునుగాక యారణ్యైక తనపాపాకరమైనయూశ ఫలియింపలేదని దుఃఖపడుచుండెను. ఆమెదుఃఖమున కామెయే కారణము. ఇంత యగుచుండఁగా నామెదుఃఖమునకొఱకు హైమవతి దుఃఖపడి కన్నీరు విడుచుట మిగుల నాశ్చర్యకరముగా నున్నది. మఱియు నారణ్యైక హైమవతి కత్యంతప్రీతిపాత్రురాలైన సోదరి ప్రభావతిజీవనసర్వస్వరూపరత్నమును హరించుకొనిపోవుట కుద్యుక్తయై యున్నది.

అయినను, నారణ్యైకదుఃఖమును జూచి హైమవతి యేడ్చుచున్నది. అట్లయినచో హైమవతి మనసెంతటిదై యుండవలయును ?

హైమవతి మనసెంతటిదైన నై యుండనిండు! ఆమె దుఃఖములనుగూర్చి యెంత చెప్పియుఁ బూర్తిగ విన్నవింపఁజాలము. ప్రకాశచంద్రుఁ డెట్టి యవస్థలోఁబడియుండెనో దానిని గూర్చి మొదటనే చెప్పియుంటిమి. ఆకారణముచేఁ బ్రకాశచంద్రుని విషణ్ణముఖమండలమును జూచినచో హైమవతిమనోభావ మెట్లగునో యిచ్చట చెప్పుట వ్యర్థము—ప్రభావతియొక్కయుఁ బ్రకాశచంద్రునియొక్కయు, నారణ్యైకయొక్కయు, ముఖమండలములందు విషాదమషీనైల్యము, ఇంకను మసివారకుండగనే—పూర్ణతనొందినట్లే కనఁబడుచుండెను. అందఱి హృదయములును లోలోపలియగ్నిచే దహింపఁబడుచుండెను. ఈవిధముగా నందఱియవస్థలును హైమవతికి మఱెవ్వరు

నెఱుఁగరు. ఆకారణమున హైమవతియు వారందఱికొఱకును జంతానివాగ్నయై విషాదము నందుచుండెను.

హైమవతి యెంతయో యోచించి చింతించి, యొక నాఁడు ప్రకాశచంద్రుని నేకాంతముగాఁ బిలిచి "ప్రకాశ చంద్రా! నేను నిన్ను నాచెల్లెలి పెనిమిటిగాఁ జూచుటలేను. నాచిన్నతమ్మునివలెఁ జూచుకొనుచుంటిని. నేఁడు నిన్నొకమాట నడుగవలయునని యుంటిని. నాతోనంతయు విశదముగఁ జెప్పెదవా?" అని యడిగెను.

ప్రకాశచంద్రుఁడు మెల్లగ "ఏమాట? చెప్పుము. నేను సత్యము నేతప్ప అసత్యమును జెప్పువాఁడనుగాను.'' అనియెను.

హైమ—నీవెప్పుడును విచారముతో నున్నవానివలె నగపడుచుంటివి. నీకు మనసున నేమియో వ్యథ యుండి యుండవలయును. అది నీముఖమును జూచుటచే నాకుఁ దెలియుచున్నది.

ప్ర—నేఁ డీమాట నెత్తుట మంచిదియే యైనది. నేనే నీతోఁ జెప్పవలయునని వచ్చుచుంటిని. నీయెదుటికి రాఁగానే యామాట నోటినుండి వచ్చుటలేదు. అక్కా! నామనస్సునకు విశేషముగ వ్యథ కలుగుచున్నది.

హైమ—నీమనోవ్యథ నంతను జెప్పుము?

ప్రకాశచంద్రుఁడు మొగమును వంచుకొని వెనుకముం దులు చూచి "నామనోవ్యథకు నీచెల్లెలే కారణము." అని చెప్పెను.

పిమ్మట నిద్దఱును గొంచెముసే పూరకుండిరి. ఒక్కరు నొక్కమాటయు నాడలేదు. తుదకు హైమవతి యొకనిట్టూ ర్పును విడిచి "నే నది యెఱుఁగుదును. కాని యామె యింకను జిన్నబిడ్డ. దానికి జ్ఞానమున్నచో నీయెడ నిట్లు ప్రవర్తించునా? నీవు వివేకవంతుఁడవు. ఆమె నించుక యాదరించి యొకటిరెం డుమంచిమాటలను జెప్పినచోఁ గ్రమముగా నదియే నీకు వశీ భూత యగును. నీవు నాకొఱకు దానియపరాధములను క్షమిం పుము." అనియెను.

ప్రకా—క్షమించుచునే యుంటిని. దాని దోషమేమి యును లేదు. అంతయు నాయదృష్టదోషమే యనవలయును. నే నామెనోటినుండి యొకమంచిమాటను వినవలయునని యెం తయో యానందముతోఁ బ్రయత్నించిచూచితిని. ఆమె నాకె ట్టియాదరమును జేయవలసినయావశ్యకము లేదు. ఒకటిరెండు మంచిమాటలు చెప్పినచోఁ జాలును. ఎంతచిన్నపిల్లయైనను మాటలాడుట యెఱిఁగియుండదా?

హైమవతి యాశ్చర్యముతో "ప్రభ నీతో బాగుగ మాటలాడుటయును లేదా?" అనియడిగెను.

ప్రకాశచంద్రుఁ డప్పుడు ప్రభావతి నడవడి యంతయుఁ దూ చా తప్పకుండ వర్ణించి చెప్పెను. చెప్పుచుఁ జెప్పుచుండ నాతనికన్నులనుండి యొకటిరెం డశ్రుబిందువులు జాఱినట్లగపడెను. ఇదియంతయుఁ జెప్పినప్పటి కాతని కించుక బరువు తగ్గినట్లయ్యెను. హైమవతి ప్రకాశచంద్రు నించుక సమాధానపఱచి "నీవు దానికొఱకుఁ జింతించుట యెందులకు; పిల్లల యందఱిస్వభావము నొకరీతిగా నుండదు. అట్టిపిల్లలు మున్ముందిట్లు చేయుచుందురు. పిమ్మట వారంతట వారే మార్గమునకు వచ్చి మంచివా రగుదురు. నేను చెప్పుదానిని నమ్మకుండనుండ వలదు. ఇంకఁ గొన్నిదినము లేఁగినచోఁ బ్రభ నీయిష్టానుసారముగా నుండును." అని చెప్పెను.

ప్రకా—నా కాయాశ లేదు.

హైమ—ఎందుల కాయాశ లేదు? నే నిట్టి వెన్నియో నాకన్నులాఱఁ జూచియున్నాను. నేను నీతో నింక నొకమాట చెప్పవలసియున్నది.

ప్రకా—ఇం కేమిమాట ? చెప్పుము.

హైమవతి నోటినుండి మఱి మాట రాలేదు. ఆమె యించుక వెనుకముందులు చూచి మాట నెత్తుటకు వెనుదీసెను. ఒకసారి కుడిచేతివ్రేళ్ల నెడమచేత నుంచి నెటికలు విరిచెను. పిమ్మట నొకసారి ప్రకాశచంద్రునిముఖమువైపునకుఁ జూచెను. మరల నాదృష్టు లధోముఖములై నేలపైఁబడియెను.

చూచుచుండఁగనే హైమవతి యావంచిన ముఖమెఱ్ఱదామ రవలె నారక్తమయ్యెను. అది చూచి ప్రకాశచంద్రుని హృదయమున నేకారణముననో గందరగోళము పుట్టెను. కాని హైమవతి యెట్టిమాటయు నోరువిప్పి చెప్పలేదు. అట్లయినచోఁ బ్రకాశచంద్రున కీయవస్థ కలుగుట యెందులకు ?

కొంచెమునే పైనపిమ్మటఁ బ్రకాశచంద్రుఁడు వాడిన ముఖముగలవాఁడై కంపితహృదయముతో "ఏమిమాటయో చెప్పరాదా ?" అనియెను.

హైమవతి యప్పుడు మూఁడునాలుగుసారులు గుటకలు వైచి శుష్కకంఠముతో "ఆరణ్యైకమాట" అనియెను.

ఈమాట నడిగి హైమవతి తల వంచికొనియెను. ప్రకాశచంద్రునిహృదయములోని గందరగోళము మఱింత హెచ్చయ్యెను. అతఁడును దలవంచుకొని "నీవిఁకఁ జెప్పవలసిన పని లేదు. నీమనోభావము బాగుగఁ దెలిసిపోయినది. నామాట యందు నమ్మక మున్నచో వినుము చెప్పెదను. నావిషయమున నీకు సందేహ మున్నదో లేదో నేనెఱుఁగను. కాని, నేను నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. ఆవిషయమున నేను పాపినిగాను." అనియెను.

హైమవతిదేహమునఁ బ్రాణము వచ్చినట్లయి యామె కించుకసాహసము కలిగెను. ఆమెమెల్లమెల్లగ "నీమాటయందు నాకించుకయు నవిశ్వాసము లేదు. కాని, యాయారణ్యైక

నోటినుండి వినినమాటలచే నాకు మిగుల భయము కలిగినది.”
అనియెను.

ప్రకా—ఆమె యేమిచెప్పినది ?

హైమ—ఆమెకు సిగ్గులేదు—బిడియములేదు. ఆమె నాయెదుట సీతతోజరపిన వ్యవహారమును జూచుటచే నాకాలు సేతులు వడకుచున్నవి. ఆమె యెట్టిమాటను గప్పిపుచ్చునది కాదు. నాకన్నిసంగతులను విప్పిచెప్పుచున్నది—ఆమె ప్రాణముకంటె నిన్ను హెచ్చుగాఁ బ్రేమించుచున్నది.

ఆకాశమున మేఘద్వయసంఘర్షణంబునం గలిగినగర్జారవ మాకస్మికముగ నలుదెసలకెట్లు వ్యాపించునో యట్లే ప్రకాశచంద్రునిహృదయాకాశమునందును నాకస్మికముగా భావద్వయసంఘర్షణంబునం గలిగినయపూర్వారావ మాతని సర్వాంగకములఁ బ్రకంపితములుగఁ జేయుచుండెను. చాలసేపై నపిమ్మటఁ బ్రకాశచంద్రుఁ డీవిధముగాఁ జెప్పఁదొడఁగెను. “నేను మొదట నామెభావమును దెలియలేకపోయితిని. ఆ యరణ్యప్రకృతి నెట్లు తెలిసికొనఁగలము ? మాటి మాటికి నామెయత్యాచారము ప్రబల మగుచుండుటను జూచి యామె మనోగతమును దెలిసికొంటిని. కాని యిప్పు డామె మొదటివలె లేదు. కొంచెము వ్యత్యాసముగా నగపడుచున్నది. ఇప్పు డిప్పు డామె కన్నిసంగతులును బోధపడుచున్నవని తోఁచుచున్నది.” అనియెను.

హైమ—నామాటలమీఁదనే యీాపరివర్తనము కలిగి యుండును. కాని, యీాపరివర్తనమును జూచినది మొదలు కొని నాకెంతయో భయ మగుచున్నది. ఆమె యీానగుమొగ మున్నచో బాగుగ నుండునని మనస్సునకుఁ దోఁచుచున్నది. ఆ నగుమొగమునకు బదులుగా నీమలినముఖమును జూచుచుండు టచే నాకేడుపు వచ్చుచున్నది.

“నాకేడుపు వచ్చుచున్నది.” అని చెప్పినమాట ప్రకా శచంద్రునిహృదయమునందు బలముగా నాటెను. అప్పు డాతఁ డొకసారి హైమవతిముఖమును జూడఁగా నామె సోగకన్నుల నుండి ముక్తాఫలములవలె నశ్రుబిందువులు జాఱి పడుచుండెను.

హైమవతి యశ్రుబిందువులను దుడిచికొని “మఱియుఁ బ్రభావతివిషయమై యోచించినప్పు డారణ్యైకమీఁదఁ గోప ముకలుగుచుండును. అప్పుడు ప్రభావతికొఱకు నేడుపు వచ్చును. ఇఁక నీవిషయమున నేమిచెప్పుదును?—నీ వసుఖివై యుండుటను జూచినచో నాప్రాణమే యెగిరిపోయిన ట్లగు చున్నది.” అనియెను.

ఇట్లు చెప్పుచుఁ జెప్పుచుండఁగా వర్షాకాలపుఁ బుష్ప ములనుండివలె నామెకన్నులనుండి యశ్రుజలము సంతతధార గఁ గురియ నారంభించెను. ప్రకాశచంద్రుఁడు స్తంభితుఁడై హైమవతిముఖమును జూచుచుండెను.

---

## పదియవ ప్రకరణము.

ఇన్నినాళ్ళ కనాఘ్రాతంబగు వనకుసుమమునందుఁ గీట కము ప్రవేశించెను. జనులకన్నుల కగపడకుండ నుదయించి యున్నపుష్ప మింతవఱకు నడవినిఁ బ్రకాశింపఁ జేయుచుండెను. ఇప్పుడు జనపదమునకు వచ్చి సంసారోత్తాపతప్తమై వాఁడుట కారంభించెను. చిదానందమయియగు నారణ్యక యిప్పుడు వన మును విడిచివచ్చి విచారసాగరమునఁ దేలుచుండెను. ప్రకాశ చంద్రుని ప్రేమించుట పాపమని యామె యేవిధముచేతను మన సున నిర్ధారణము చేసికొనలేక పోవుచుండెను. అట్లయినచో నామెహృదయమునం దీయాతన యెక్కడనుండివచ్చి చేరినది? పాపపుణ్యాపరూపమైన యామె జ్ఞానవృక్షమూలమునకుఁ గంచె వైచినవారెవ్వరు ? చింతాశూన్యమైన యామెహృదయమునం దీభీషణానలము నుంచి ప్రజ్వలింపఁజేసినవారెవ్వరు ? ఆరణ్యక యనేకసమయములయందు నిర్జనప్రదేశమునఁ గూర్చుండి యో చించుకొనుచునే యుండెను.

ఇప్పు డారణ్యక ప్రకాశచంద్రునిఁ జూచుటతోడనే పో యి యాతనిపైఁ బఱుట నిలిచిపోయెను. మఱియు నాసమయ మునం దేదో యొకతరంగము పుట్టి యామె చిన్నిహృదయ ము నుద్వేలితముగాఁ జేయుచుండెను; ఇష్టము వచ్చినట్లెల్లఁ జేయఁజాలనిదై చెప్పశక్యముగాని యవ్యక్తపరితాపము నను

భవించుచుండెను. ఆమెశరీరము పోయి ప్రకాశచంద్రుని మే నిపైఁ బడకున్నను, నామెయాతనామయహృదయము పోయి యాతనియొడలిపైఁ బడుచుండెను. ఆరణ్యైక యిప్పటికిని ప్రకాశచంద్రునిఁజూచుటకై యెప్పుడును వ్యాకులచిత్తయై తిరుగుచుండును. కాని, యాతనిఁజూచినతోడనే ముఖమును వంచికొనును. ఆమె యిప్పుడును ప్రకాశచంద్రునిమాటలను వినుటకై యాత్రముతోఁ జెవియిచ్చి వేచియుండును. కాని, యాతనిమాట చెవినిఁ బడినతోడనే యామెహృదయమునం దొక దుఃఖప్రవాహము బయలువెడలి ప్రవహించుచుండును.

ఆరణ్యైక పుట్టినది మొదలు ప్రకృతితోడమీఁదనే పెరిఁగి పెద్దదైనది. అందువలననే సంసారమునందలి యీరహస్యము నెప్పుడు నించుకంతయు నామె గ్రహించియుండలేదు. ఆమె యొక్కొక్కసారి హృదయదుఃఖోపశమనమునకై సమీపమునందున్న వనమునకుఁ బోయి తిరుగుచుండును. కాని యడవియందుఁ దిరుగాడుచున్నను మునుపటివలె మనస్సునకు శాంతి కలుగుటలేదు. ఒక్కొక్కసమయమున నారణ్యైక వనమునుండి వనపుష్పములను గోసికొనివచ్చి యింటియందుఁ గూరుచుండి హారమును గట్టుచుండును. కాని, యాహారముచే నెవ్వని కంఠము నలంకరింపవలయునని యామె హృదయమునఁ దల్లడిల్లుచున్నదో యాతనికాహారమును వేయఁబోవుట కామె కెందువలననో సాహసము కలుగుటలేదు. అందువలన నామె

క్షోభకును దుఃఖమునకును బారమే లేకుండెను. ఆరణ్యైక తన స్వభావ మాకస్మికముగా నెందుల కిట్టివింతమార్పును జెందిన దో యూహింపఁజాలక యద్భుతసాగరమున మునిఁగి తేలుచుం డెను. ఆరణ్యైక యతృప్తికరమైన యీయాశ యెప్పటికిని దృప్తినొందదా యేమి? ఈవిచారమున కామె మనస్సునందుఁ జోటిచ్చెను. ఆరణ్యైకమనస్సునందలి సుఖమేమో పోయినది. కాని, యామెయాశమాత్ర మింకనుబోలేదు.

ప్రకాశచంద్రుఁ డిప్పుడు తనహృదయమునుండి యా దుర్దమనీయసాహసమును బోఁగొట్టుకొనియెను. ఆకారణమున నారణ్యైకను జూడకుండ నుండుట కేమేమి ప్రయత్నములు చేయవలయునో యాయాప్రయత్నములను జేయుచుండెను. ఆకస్మికముగ నామెను జూచినచో, నిస్సందేహముగా, ధారా ళముగా నామెతోమాటాడుటకు సాహసము కలుగుట లేదు; ఏదో నెపమును గల్పించుకొని యక్కడనుండి దూరముగా వెడలిపోవును; ఆనాఁటి కానాఁడు తనహృదయదార్ఢ్యమును బోగొట్టుకొనుచుంటి నని ప్రకాశచంద్రుఁ డూహింపఁజాలకుం డెను. ఈసమయమునఁ బ్రభావతివ్యవహారము మనస్సునకుఁ దెచ్చుకొని యావిషయమునఁ దానగపడచిన ధీరత్వమునకై నొచ్చుకొనుచుండును.

ఇఁక మేము ప్రభావతి విషయమునుగూర్చి చెప్పెదము. ప్రభావతి ప్రకాశచంద్రునియందు మొదటివలెనే మోడివహిం

చియుండెను. దానిలో నించుకంతయును మాఱ్పుకలుగలేదు. ప్రకాశచంద్రుఁడు ప్రభావతితో సల్లాపములాడుట కంతగా నాతఁడు నుదియుండుటను లేదు. మాటలు వెచ్చపెట్టకుండఁ గనే యుభయులును మౌనముగా రాత్రిని గడపివైచుచుండిరి. ప్రభావతి సుఖముగాఁ బ్రగాఢనిద్రను బొందుచుండెను. కాని, ప్రకాశచంద్రుఁడు రాత్రియంతయు శయ్యపైఁ బొరలాడుచునే యుండెను. ఆకారణమునఁ బ్రభావతిముఖము మాలిన్యము నంద లేదు. క్రమముగా నామెముఖమునందు స్వల్పస్వల్పముగా విస్ఫూర్తిలక్షణములే యగపడుచుండెను. స్ఫూర్తి కలిగినచో నెచ్చెలి యావశ్యకము కలుగును. ప్రభావతి యీసమయమున నెచ్చెలిని వెదకికొనుచుఁ దిరుగాడుచుండెను. కాని, యారణ్యక యిప్పుడు మునుపటివలె నెప్పుడు నామెతో నుండుట కిష్టపడు చుండుట లేదు. ఒకనాఁడు ప్రభావతి యారణ్యకను దనగదిలో నికిఁ దీసికొనిపోయి "అక్కా! నీవు నాతో బాగుగ మాటాడు టలేదేమి?" అని యడిగెను.

ఆరణ్యక నిట్టూర్పుచు విడిచి "ఎవ్వరితోడ మాటాడుట కును నాకిష్టముగా నుండుట లేదు." అనియెను.

ప్రభా—నేను నీకేమి యపరాధము చేసితిని ?

ఆర—లేదు. నీవు నాకేమి తప్పు చేసితివి ?

ప్రభా—నీవు మొదట మాయింటికి వచ్చినప్పు డొకవిధముగా నుంటివి. ఇప్పుడు మఱియొకవిధముగా నగపడుచుంటివి.

ఆర—అడవిపక్షి, అడవియం దుండుటయే మంచిది. నేను మీయింటికి వచ్చుట మంచిపని యైనదికాదు.

ప్రభా—నీవు మరల నడవికిఁ బోయినచో సుఖముగా నుందువా ?

ఆర—సుఖముగా నుందునో కాక యుండలేనో చెప్పఁ జాలను. నాయదృష్టమునం దింక సుఖము లేదు. కాని, యీ మీజనపదముకంటెను మాయడవియే వేయిరెట్లు మంచిదని తోఁచుచున్నది.

ప్రభా—నీ యసుఖమునకుఁ గారణమేమో చెప్పెదవా ?

ఆర—చెప్పఁగలను. కాని, నీతోఁ జెప్పు టుచితమో కాదో తెలియుట లేదు. చెప్పినదోషమేమో?—నాకు భయ మగుచున్నది.

ప్రభా—దోష మేమియును లేదు. చెప్పుము.

ఆర—అట్లయినచోఁ జెప్పెదను వినుము. దానినిగూర్చి చెప్పుటకెంతో సంతోషముగా నున్నది. ప్రకాశచంద్రుని జూచినచో నాకు మనస్సునం దెట్లోయుండును. దానిని నోటితోఁ జెప్పఁజాలను. నాకన్నుల కంతటిసుందరుఁడీమీలోకమునను న్నట్లగపడదు. మఱియు నాతనికంఠస్వరము నా చెవులకుఁ గోకిలకంఠస్వరముకంటె నెంతోయింపుగా వినఁబడుచున్నది. నా హృదయ మెప్పుడు నాతనితో నుండుటకే యత్నించుచుండు

ను; ఎప్పుడు నాతనిఁజూడవలయు ననియే యాసకలుగుచుం డును. ఆతనితో నీజనపదమున నుండుట కిష్టములేదు. ఒకనిర్జ నారణ్యమునకుఁ దీసికొనిపోయి, యక్కడ నాతని నాహృద యమునందలి హృదయాంతరమున దాఁచుకొని యుండవలయు నని యాశ కలుగుచున్నది. చెల్లెలా! ఇప్పుడు నీవు చెప్పుము. నేనాతనిఁ బ్రేమించుటలేదా? ఇట్టి నాయాశకుఁ బ్రేమ యని పేరుపెట్టినచో, నేనాతనిఁ బ్రేమించుమనే యుంటిని—అత్యం తముగు బ్రేమించుచుంటిని. చెల్లెలా! ఇంక వినుము, నీవాతనిని బెండ్లియాడితివి. నేనాతనిఁ బ్రేమించుట పాపకార్యము—మన స్సులోఁ బ్రేమించుటయును బాపకార్యమే. కాని యెంతవలకుఁ బాపకార్య మగునో నాకుఁ దెలియదు. నేను పాపకార్యము ను మిగులఁ దిరస్కారము చేయుచుంటిని. కాని, యాతనిఁబ్రే మింప కెట్లూరకుండఁగలను? ఆతని నామనసున ధ్యానింపక బ్రతికియుండుట యెట్లు?—నేను—

ప్రభావతి, వెన్నెలవలెనున్న చలువవాతితో నిర్మింపఁ బడినమూర్తివలె స్థిరభావముతోఁ గూర్చుండి యారణ్యక మాటల నన్నిఁటిని వినుచుండెను. దిక్కుదెలియనిపథికున కాక స్మికముగ సరియైనమార్గము దొరకినచో నెట్లుండునో ప్రభావతి కట్టియవస్థయే కలిగెను. అభావనీయమైన యచింత్యమైన యీా సమాచార మాకస్మికముగ నామెహృదయము నుద్వేలితము గాఁ జేసివైచెను. మొదట నాశ్చర్యము-పిమ్మట తిరస్కారము;

తుదకొక భయంకరహింసానల మామెహృదయమునఁ బ్రజ్వ లింప నారంభించెను. హృదయోద్వేగముచేఁ బ్రభావతికిఁ దాలిమి తప్పిపోయెను. ఆమె యారణ్యికమాట లింకసాగకుండ నిలిపి "ఆఁగుము—ఇఁకముందు చెప్పవలదు. నీకు మరణమే మంచిది." అని చెప్పెను.

నిర్భీకమైయున్న యారణ్యికహృదయమునం దీమాటల వలన భయసంచారము కలిగెను. ఆమె భయపడి ప్రభావతి వైపునకు ముఖమెత్తిచూచెను. కాని, యామె మనోభావమును దెలిసికొనఁజాలకపోయెను. ప్రభావతి, మండుచున్న యనల జ్వాలను బైకిఁ జూపింపకయె హృదయమునఁ గప్పిపుచ్చి నగు మొగముతో "నీవెవ్వరినిఁ బ్రేమించుచుంటివో వారును నిన్ను బ్రేమించుచున్నారుకాదా ?" అని యడిగెను.

ఈప్రశ్నచే నారణ్యికభయము దూరముగఁ బోయెను. ఆమె భయశూన్యహృదయముతో "అది బాగుగఁ దెలియదు. ప్రేమించుటలేదని తోఁచుచున్నది—ప్రేమించినను బ్రేమింప వచ్చునని తోఁచుచున్నది." అనియెను.

ప్రభా—ప్రేమించుచున్నచో నీవాయన వద్దకిఁ దీసి కొని పోయెదవుగాదా ?

ఆర—నాయిష్టము వచ్చినట్లు పనిజరుగుటలేదు. తీసి కొనిపోయినచోఁ బాపమా ప్రభా !

ప్రభా— ఇంక నీకుం బాపపుణ్యము లెక్కడ నున్నవి?

ఈమాట చెప్పి ప్రభావతి యక్కడనుండి లేచి యాక స్మికముగం బాఱిపోయెను. ఆరణ్యక విస్మితలోచనయై యా వైపునకుం జూచుచుండెను.

## పదునొకండవ ప్రకరణము.

ఏఘటనావిశేషమువలన మనమునకెంతటి పరివర్తనము గలుగునో యెవ్వరైనం జెప్పంగలరా? ఒకఘటనయొక్క గురుత్వలఘుత్వములమీఁదం బరివర్తనముయొక్క గురుత్వ లఘుత్వపరిమాణమును జెప్పుటకు వీలులేదు. ఒకసామాన్య ఘటనవలన నత్యంతాశ్చర్యకరమైన పరివర్తనము కలుగుటను జూచుచున్నాము. ప్రకాశచంద్రునిపై నారణ్యకకుంగల విఘ్న క్తముకాని ప్రణయమును మేము సామాన్యఘటన మని చెప్పం జాలము. ఆరణ్యకవలన నాప్రణయసమాచారము నొక్కసారి వినినంతమాత్రమున నిన్నాళ్ళకుం బ్రభావతిహృదయమున నాకస్మికముగాం గలిగిన పరివర్తనము విస్మయజనకమైనదియే యగును. ఇప్పటిప్రభావతి మునుపటిప్రభావతి కాదు. ఏప్రభా వతి ప్రకాశచంద్రునిపేరు విన్నంతమాత్రమున భయముచేం గం పించుచుండెనో, ఆప్రభావతి ప్రకాశచంద్రునిం జూచి చిఱుబు స్సు మని తర్జనభర్జనములను జేయుచుండుటను గాంచి యుంటి

మి. హైమవతియాశీర్వాదము ఫలియించినది—ఇప్పు డాప్రభావతి ప్రకాశచంద్రునిప్రణయమునకుఁ బాత్రురాలై యుండుటకై లాలస యగుచుండెను. ఏయారణ్యైక ప్రభావతి కానందదాయినియై యుండెనో, అట్టియారణ్యైక యామెకన్నుల కిప్పుడు శూలముగా నగపడుచుండెను. అందుచేత నేఘటనవలన మనసునం దేపరివర్తనము గలుగునో యెవ్వరును జెప్పఁజాలరని చెప్పియుంటిమి.

ప్రభావతి యిన్నాళ్లకుఁ దనభర్తవిషయమునఁ దాను జేయవలసిన దేమియో తెలిసికొనియెను. తాను తనభర్త యెడ వర్తించినవర్తన మనుచితమైనదని తెలిసికొని యామె మనసునఁ బరితాపపడఁజొచ్చెను; ఇంతవఱకును దన కట్టిదుర్బుద్ధి యెందులకుఁ బుట్టినదని యాలోచించుకొనఁజొచ్చెను. దానిపై నామెమనసున నారణ్యైకపై నత్యంతక్రోధము జనియించెను. ఇప్పుడు ప్రభావతిశయనగృహమునకుఁ బ్రకాశచంద్రుఁడు పరుండుటకై వచ్చినచో నామె మునుపటివలె శయ్యపైఁ బరుండి నిద్రించుటలేదు. శయనగృహమున రత్నకంబళముపైఁ గూరుచుండి తములపాకులకు సున్నమును రాచి వానిని మడచుచుండెను. ప్రకాశచంద్రుఁడు వచ్చుటను జూచి వేగముగ బైఁటచెఱగుసరిచేసికొని లేచివచ్చి మడఁచిసిద్ధముగనుంచినవిడియము నాతని కిచ్చెను. ప్రకాశచంద్రుఁ డాశ్చర్యపడి "ఇదేమి?" అనినాఁడు.

ప్రభావతి మెల్లమెల్లగ "మీకుఁ దాంబూలముపై మి గుల నాసక్తికాదా ? వేసికొనుఁడు." అనియెను.

ప్రకా—నేఁ డిదేమి ? అంతయును క్రొత్తగా నున్నది.

ప్రభా—మీరు తాంబూలమును వేసికొనుటయును క్రొత్తకాదు. నేను తములపాకులకు సున్నమును వ్రాసియిచ్చు టయుఁ క్రొత్తకాదు. ఇఁకఁ క్రొత్త యెక్కడనుండి వచ్చినది?

ప్రకా—నీ విట్లు తాంబూలము నిచ్చుటయే క్రొత్త. నీ వెప్పుడు నిట్లాకుమడఁచి యీయలేదు.

ప్రభా—ఇచ్చినచో దోషమేమి వచ్చును ?

ప్రకా—దోషము లేదు. ఇదేమి ? ప్రభా ! నేఁడింత యనుగ్రహమేమి ?

ప్రభా—ఇంకను ననుగ్రహమేది ?—ఇన్నాళ్లును దెలి యనిదాననై యుంటిని గాని, యెప్పుడు నట్లే యుందునా ?

ప్రకాశచంద్రుఁడు మనసున "నే నేమి, స్వప్నమును గనుచుంటినా ?" అని భావించుకొని "నీమాటను విని సంతు ష్టుఁడనైతిని. కాని,యాకస్మికముగ నీమార్పు దేనిచే నెందులకుఁ గలిగినదో తెలియుటలేదు." అనియెను.

ప్రభా—దానిని తెలిసికొనవలసినయావశ్యక మేమి ? నే నొకమాట యడిగెదను. చెప్పెదరా ?

ప్రకా—ఏమిమాట ? అడుగుము.

ప్రభా—ఆరణ్యిక యెక్కడ దొరకినది ?

ప్రకా—అరణ్యమునందు.

ప్రభా—ఆసంగతి వినియున్నాను. ఏయరణ్యమున ?

ప్రకా—అది నాకుఁ దెలియదు.

ప్రభా—ఆయరణ్య మిక్కడ కెంతదూరము ?

ప్రకా—ఆఱుక్రోశము లుండవచ్చును.

ప్రభా—ఏదిక్కునందు ?

ప్రకా—పశ్చిమదిక్కునందు.

ప్రభా—ఆ యరణ్యమును జేరి యేదియైన గ్రామ మున్నదా ?

ప్రకా—బదరగంజిగ్రామ మున్నది. కాని యిన్నాళ్ల యినపిమ్మట నీవిచార మంతయు నెందులకు ?

ప్రభా—ఇంతవఱకును నారణ్యిక మిమ్ముఁ బ్రేమించిన దని నాకేమిదెలియును ? ఆమె నాకు సవతి యైనదని నేఁటికిఁ దెలిసినది.

ప్రకాశచంద్రుఁ డించుక వడఁకెను. ఆకస్మికముగా సమీపమునఁ బిడుగుపడినచో జను లెట్లు స్తంభితులగుదురో యట్లే యాతఁ డించుకసేపటివఱకు నుండెను. ప్రభావతి ప్రకాశచంద్రునివైపునకుఁ జూచుట లేదు. ఆమెమనసులో నేదో యొకతంత్రము నాలోచించుచుండెను. చాలసేపైన పిమ్మట

ప్రకాశచంద్రుఁడు "ప్రభా! నీ కీమాట చెప్పినవా రెవ్వరు?" అనియెను.

ప్రభా—ఆమెయే స్వయముగఁ జెప్పినది. మీ రాయారణ్యైక నెందులకుఁ బెండ్లి చేసికొనలేరు?

ప్రకా—అదేమి? నాకుఁ బెండ్లికాలేదా? నేను మరల నెందులకుఁ బెండ్లియాడవలయును?

ప్రభా—అట్లయినచో నింతటి ప్రణయ మెందులకు?

ప్రకా—ఆమె నాప్రాణములను గాపాడినది.

ప్రభా—ఆమె యిప్పుడు మీకొఱకుఁ జచ్చుచున్నది గాదా—మీ రామెప్రాణములను గాపాడుఁడు!

ప్రకా—సాంసారిక సామాజికములగు నేవిషయములను గూడ నామె యెఱుంగదు.

ప్రభా—కాని, మిమ్ముల నడవికిఁ దీసికొనిపోవలయుననుసంగతి బాగుగ నెఱిఁగియున్నది.

ప్రకా—నీ కీమాట చెప్పినవా రెవ్వరు?

ప్రభా—ఈమాట లామెవలననే వింటిని.

ప్రకా—నీవు నాభార్యవు. ఇట్లుండఁగా నిట్టిమాటలనన్నిటి నీతోఁ జెప్పినయామె కిఁక సంసారజ్ఞాన మున్నదని యెట్లు చెప్పవచ్చును? ఆమెహృదయ మెంతసరళమైనదియో నీవే యోచించి చూడుము. ఏమైనఁ గాపట్య మున్నదా?

ప్రభా—చూచినట్లే. మీ రామె నెంతో ప్రేమించు చున్నా రని బాగుగ నెఱుఁగుదును. అట్లేకానిచో నా మొపక్ష ముగా నిన్నిమాట లెందులకుఁ జెప్పెదరు ?

ప్రకా—అందువలన నీకుఁ గలిగినహాని యేమి ? నీవే మో నన్నుఁ బ్రేమించుట లేదు. ప్రేమించుట లేదని నీవు నీనో టితోడనే చెప్పితివి.

ప్రభావతి మరల మాటాడలేదు. కొంతసేపూరకుండి యేమియో యోచించుకొని స్థిరభావమును వహించెను. కాని యీవిషయమునందు భర్తతో నింతవఱకు మాటాడి తృప్తినొంద లేకపోయెను. అందువలనఁ గొంచెముసే పూరకుండి మరల "నా కేమియు హాని లేకపోవుఁగాక! కాని మీకు హానియున్నది. మీకు ధర్మభయము లేదా ? ఆరణ్యక మీ కేమగును ? మీ కేమి సంబంధ మున్నది? మీరామె నెందులకుఁ బ్రేమింపవల యును ?" అనియెను.

ప్రకాశచంద్రుఁ డించుకయుత్తేజితుఁడై "నాకు హాని యున్నది. నాధర్మభయమును నే నెఱుఁగుదును. నీ వామాట నెందుల కడుగవలయును ?'' అనియెను.

ప్రభా—ఎందుల కడుగవలయునా? ఈయన్యాయ మును జూచి యొకసారిగాదు—నూఱుసారు లడిగెదను.

ప్రకా—నేఁడు మహోద్భుతముగా మాటాడుచున్నావు. నాపై నింత యొత్తు డెందులకు ?

ప్రభా—మిమ్ముల నింకను నొత్తుఁడు సేయవలయును.

ప్రభా—అట్లయినచో నిదియాతయు నింతవఱ కెక్కడ కుఁ బోయినది ?

ప్రభా—ఇంతవఱకును మీ రారణ్యైకను బ్రేమించుచు న్నారని నా కేమి తెలియును.

ప్రకా—నీవిట్లు విశ్వసించుట తప్పు. నే నామె నెందు లకుఁ బ్రేమింపవలయును? ఆమె నాప్రాణములను గాపాడినది. ఆమె కీసంసారజ్ఞానము లేదు. ఆమెయం దేమైన దోషమున్నను నది దోషముగాఁ గనఁబడదు. ఆమె కేమైన దుఃఖముకలిగినచో నాహృదయము పరితపించును.

ప్రభా—మీ రికమీఁద నామెతో మాటాడరాదు. ఆమె దగ్గఱ దిరుగఁగూడదు. ఆమెతో మీ కెట్టిసంపర్కము నుండఁగూడదు.

ప్రకా—నీకు నాయందు నమ్మకము లేదా ?

ప్రభా—ఇంచుకంతైన లేదు.

ప్రకాశచంద్రుఁ డిప్పు డీమె మొదటిప్రభావతి కాదని తెలిసికొనియెను. అట్లయినచోఁ బ్రభావతి యాతనిఁ బ్రేమించు చున్నదా? ప్రేమింపకపోయినచో నింతనిర్బంధ మొందులకు ? పుల్లవిఱిగిపోయిన యొకపూలమొక్క యాకస్మికముగాఁ జిగిర్చి పూచుటను జూచినచో నెంతసంతోషము కలుగునో యంతటి

సంతోషప్రవాహము ప్రకాశచంద్రుని మనంబున బయలువెడ లెను. దొంగిలింపఁబడినధనము దొరకినచో నెంతటియుల్లాసము కలుగునో యట్లే యీఘటనవలన నాతనిమనసున నాకస్మిక ముగ నుల్లాసము నుద్భవించెను. ఆకారణమున నారణ్యోకసం బంధమునఁ బ్రభావతికిఁ గలిగియున్న తప్పుతలంపును దొలఁగిం చుటకై యాతఁడు విశేషప్రయత్నమును జేయ నారంభించెను. ఆకస్మికముగఁ బ్రభావతి కాతనియం దవిశ్వాస ముదయించుట నెందులకు? ఇంతవఱకు నవిశ్వాసము పుట్టుటకుఁ దగినయేప నియు నాతఁడు చేయలేదు. బుద్ధిమతి యగు హైమవతి యాత నియం దించుకయు నవిశ్వాసమును మోపనప్పు డల్పబుద్ధియగు నీబాలిక కింతయవిశ్వాస మెందులకు? ప్రకాశచంద్రుఁ డిదియం తయుఁ దనమనసున నాలోచింప నారంభించెను. మఱియుఁ బ్ర భావతి కనేకవిధముల బోధింపఁదొడఁగెను. ఆరణ్యోకయందుఁ దన కెట్టిదూషితాభిప్రాయమును లేదని యనేకవిధములఁ జెప్పె ను. కాని, ప్రభావతిమనసునందున్న యవిశ్వాస మించుకంతైన తగ్గలేదు. అప్పుడు ప్రకాశచంద్రుఁడు మనోవ్యాకులతతో నిద్రావశుఁ డయ్యెను. వెలుఁగువచ్చుటకు ముందుగా నాతఁ డొకస్వప్నమునుగాంచి విశేషముగ వ్యథితుఁ డయ్యెను.

ఆరణ్యోక కాకస్మికముగ మరణము కలిగినట్లును, తా నామెశవమును భుజముపైఁ బెట్టుకొని ఒకయడవినుండి మఱి యొకయడవికిఁ దిరుగుచున్నట్లును, అప్పు డారణ్యోకతండ్రియైన

యాగజదాఁగను జూచినట్లును, ఆదాంగ తనతనయమరణమును జూచి క్రోధాంధుఁడై ప్రకాశచంద్రునిప్రాణములను హరించుటకై ప్రయత్నించుచుండఁగాఁ బ్రకాశచంద్రుఁ డొంటిప్రాణముతోఁ బరువెత్తుకొనివచ్చి యొకపర్వతము నెక్కి యక్కడనున్న యొక సన్యాసిని జూచి యారణ్యైకకు మరలఁ బ్రాణముపోయు మని ప్రార్థించినట్లును, సన్యాసి కమండలూదకము నారణ్యైకపైఁ జల్లినతోడనే యామె లేచి కూర్చున్నట్లును, కాని, యామె ప్రకాశచంద్రుని గుర్తింపలేకపోయినట్లును, అయినను నామె నింటికిఁ దీసికొనిరావలయు నని యాతఁడు ప్రయత్నింపఁగా నామె యందుల కొప్పక యాతనికన్నులయెదుట నొక పుష్పరథము నెక్కి వెడలిపోయినట్లును, అప్పుడు తా నేడ్చుచున్నట్లును,— ఆతఁ డొకస్వప్నమునుగాంచెను. తరువాత నిద్రాభంగమయ్యెను.

నిద్రాభంగ మైనపిమ్మటఁ బ్రకాశచంద్రుఁడు లేచిచూచెను. చూడఁగాఁ గన్నీటితోఁ దలగడ నిజముగాఁ దడిసిపోయియుండెను. ఆరణ్యైకకొఱ కింతటికన్నీరును విడుచుట చూచి ప్రకాశచంద్రుని కానందమే కలిగినదో, కాక దుఃఖమే కలిగినదో మాకుఁ దెలియదు. కాని యీస్వప్నముచే నాతఁ డారణ్యైకకు ముం దమంగళము కలుగునని యనుకొని యాభయముచే వ్యాకులచిత్తుఁ డయ్యెను. అది యాతనిముఖమును జూచుటచే మాకుఁ దెలియవచ్చినది.

---

## పంద్రెండవ ప్రకరణము.

అమావాస్యరాత్రి—అర్ధరాత్రి కావచ్చుచుండెను. నలు దెసలయందును గాఢాంధకారము క్రమ్ముకొనియుండెను. నిమిషనిమిషమునకును మెఱపుమెఱయుచు నాగాఢాంధకారమును మఱింత హెచ్చుచేయుచుండెను. అమావాస్యరాత్రియంధకార మొకవిధముగా బాగుగనే యుండును. కాని, యీయంధకార మధ్యమునందు పిశాచములనవ్వువలెఁ దీవ్రకాంతితోఁ క్షణక్షణమునకును దోఁచుచున్న యీక్షణప్రభమను నిర్భయముతోఁ జూచి సహింపఁగలమా? అదియటుండనిండు. క్షణస్థాయియై యీమాత్రపు వెలుంగును లేని కాయక్లేశమునే మనము వహించియుంటిమి. కాని, దానివెనుక దిక్కులను గంపింపఁ జేయుచు హృదయమున భీతిని నెలకొల్పుచున్న యీగర్జనము నెట్లు సహింపఁగలము? సువర్ణమయియు, దేవబాలయునగు నాచపల (మెఱపు) యంధకారమునందే యానందపడుచున్నట్లున్నది. అందుకొఱకు నేఁటియమావాస్యరాత్రి గాఢాంధకారముతో నిబిడమేఘావృతాకాశాంధకారము చేఁయుండుటను జూచి చపల నిలిచి నిలిచి యానందముతో నాయంధకారమునం దాఁకుచు నాడుచు క్షణమున కొకసారి యదృశ్యయగుచున్నది. ఆమెకు మిగులఁ దొందరగలిగెను. అంధకారమునఁ దిరుగునాశనుగూడ విడుచుటలేదు. మఱియొకవైపున స్వర్గచ్యుత నగుదునని భయపడుచుండెననియుఁ దోఁచుచున్నది.

చూచుచుండఁగనే వర్షము నారంభ మయ్యెను. మొదట "చిట్‌పట్"అను ధ్వనులతోఁ జినుకులుపడనారంభించెను. పిమ్మటఁ జిటపటశబ్దములతోను తుదకు హోరు మనుధ్వనితోను వాన గురియ నారంభించెను. ఎప్పుడు వర్ష మధికము కాఁజొచ్చినదో యప్పుడే ప్రభావతి తనగదిని విడిచి యాయంధకార మునఁబడి మెఱపుసాహాయ్యమున మెల్లమెల్లగ నీవలికి వచ్చెను. ఆమె మిగులజాగరూకతతో మెల్లగఁ బాదముల నిడుచు నారణ్యకశయనగృహమునకు వచ్చి మిగుల మెల్లగ "ఆరణ్యకా!" అని పిలిచెను.

ఆరణ్యక నిద్రించుట లేదు. ఈయసమయమునం దిట్లు జోరుమని వర్షము కురియుచున్న చప్పుడులోఁ దన్నెవ్వరో మెల్లగ బిలిచినశబ్ద మాచెవులఁ బడియెను. స్వరమునుబట్టి పిలిచినవారి నానవాలుపట్టెను. ఆమె మెల్లగ లేచి కూర్చుండి "ఏమి?" అనియెను.

ప్రభావతి మొదటివలెనే మృదుస్వరముతో "ఒకపని చేయఁగలవా?" అని యడిగెను.

ఆర—ఏమిపని?

ప్రభా—పీరగంజియందలి పద్మపుష్కరిణి నెఱుంగుదువా?

ఆర—ఎఱుఁగుదును.

ప్రభా—నీవప్పుడప్పుడు నాతోఁ జెప్పుచుంటివిగదా ?—ఎంతటి చీఁకటిరాత్రియందును నీకు భయములేదు—నీ విప్పుడు పోయి యాపద్మపుష్కరిణినుండి కొన్ని పద్మములను దెచ్చిపెట్టఁగలవా ?

ఆర—తెచ్చెదను. కాని, నీ కాపద్మము లెందులకు ? ఏమిచేసెదవు ?

ప్రభా— నేఁ డమావాస్యరాత్రి. అర్థరాత్రి కింకను గొంచెము వ్యవధి యున్నది. నేఁ డర్థరాత్రియగునరికి సరిగా నాపద్మములతో మహాజననియగు కాళినిఁ బూజ చేసినచో నాయిష్టసిద్ధి యగును. నే నామహాజననికి మ్రొక్కుకొనియుంటిని. నా కీయుపకారమును జేయఁగలవా ?

ఈసమయమున వెలుపల దడదడశబ్దముతో భయంకరమైన పిడుగుపడియెను. ప్రభావతి హృదయమునందును దడదడయను శబ్దమయ్యెను. ఆమె యారణ్యకప్రక్కపైఁ జదికిలఁబడియెను. కాని, యారణ్యక విలంబనము సేయకుండ లేచి వేగముగ నాగదినుండి వెలుపలకుఁ బోయెను. అప్పుడు ప్రభావతి హృదయము మరల దడదడ కొట్టుకొనసాగెను.

ఆరణ్యక వెలుపలికి వచ్చునప్పటి కాపెద్దవర్ష మాగి పెద్దపెద్దవానచినుకులుమాత్రము పడుచుండెను. ఇప్పటి కేకారణముననో గాని యారణ్యకహృదయమును గొట్టుకొనసాగెను. ఆహృదయశబ్దమును ముంచుకొనుచు నాకాశమున

మేఘము గర్జింపఁజొచ్చెను. ఆమేఘగర్జనమును నొకవిధముగ భయంకరముగనే యుండెను. ఈగర్జనము మొదటివలె క్షణ కాలము భయమును బుట్టించి యావెంటనే యాకాశములోఁ జేరిపోవుటలేదు. ఈగర్జన మొక ముహూర్తములో నాలుగు దిక్కులను గంపింపఁజేసి పోవఁదగినది కాదు. ఈగర్జన మవిశ్రాంతమై, శబ్దమయమై, యొప్పునొక భయప్రవాహము నాకాశమునుండి భూమిమీఁదికిఁ బ్రవహింపఁజేయుచుండెను. ఆశబ్దముతో స్థాయియగు ప్రకంపనప్రవాహము నలువెసలఁ దరంగాయిత మగుచుండెను.

ఇట్టియంధకారమునం దిట్టిదుర్యోగసమయమున నారణ్యేకమనసున భయసంచార మగుట యెప్పుడును లేదు. కాని నేఁ డామెమనసున భయ మెక్కడనుండి వచ్చినది? తీవ్రమగు నామెగతి క్రమముగా మందము గాఁజొచ్చెను. కాని యామె తనపనినుండి విరమింపలేదు; మెల్లమెల్లగనే ముందటికిఁ బోవుచుండెను. ఆచపలావైద్యుతికషేలన మిప్పు డగపడుటలేదు. ఆ చపల ప్రతిముహూర్తమునందును వెలుపలికి వచ్చి యామెట కైమాత్రము తొంగితొంగి చూచుచుండెను. మొదటివలెనే యాక్షణప్రభాతీవ్రకాంతి లేకపోయినను నీక్షణప్రభ మును పటికంటెను నుచ్చస్థాయిదైయుండెను. ఆకారణమునఁ జపల గతియు మందమగుచుండెను. మఱియు నాకాదంబినియావేగ భయంకరగర్జన మిప్పుడు మృదుగంభీరభావమును దాల్చుటచే

నదియును మందమయ్యెను. చపలయును మంద—కాదంబిని యును మంద—ఇట్లున్నప్పు డారణ్యకగతిమాత్రము మందము గాకుండునా ?

ఆరణ్యక మెల్లమెల్లగఁ బోయి పీరగంజియందలి పద్మ పుష్కరిణినిఁజేరెను. ఎంతయోకష్టపడి యొకపద్మమును గోసి కొని యామె మెల్లమెల్లగ నొడ్డునకు వచ్చెను. ఈసమయమున నాకస్మికముగ మరల మొదటివలెనే తీవ్రజ్యోతిర్మయియగు నాచపల, ఆకాశమునందలి యొకప్రాంతమునుండి మఱియొక ప్రాంతమున కేకాకారముతో గలిసలిపి వెడలిపోయెను. ఆక స్మికముగ నారణ్యక చకితయై యొకసారి నలుదెసలఁ బరికించి చూచెను. సమీపమునం దొక గాలాంతకయమునితో సమాన మగు నొకభయంకరమనుష్యమూర్తి నావెలుఁగులో నామె చూచెను. ఆయుత్తరక్షణమునందే భయంకరమగు నొకపిడుగు పడియెను.

---

## పదుమూఁడవ ప్రకరణము.

---

నేఁడు జగచ్చంద్రునిగృహమునఁ జాలగందరగోళముగా నుండెను. ఉదయమునలేచి చూచునది కారణ్యక యెవ్వరికి నగపడకుండుటయే యందులకుఁ గారణము. ఆమెను వెదకుటకై జనులు నలుదెసలకును బోయిరి. కాని యెవ్వ రును నామెజాడను దీసికొని రానేరరైరి. నేఁడు జగచ్చం

ద్రానియింట బ్రొయిలో నిప్పు వేయలేదు. అతఁడు కచ్చేరికిని బోలేదు. ఇంటియందొకవ్యక్తి తక్కఁ దక్కినవారందఱు నార ణ్యేకకొఱకు వ్యాకులచిత్తులై యుండిరి. విశేషించి ప్రకాశ చంద్రునకును హైమవతికిని గలదుఃఖమునకు పరిమితియే లేదు. ఆనాఁడు హైమవతి మంచినీళ్లనైనఁ ద్రాగలేదు. ప్రకాశచం ద్రుఁ డాదిన మంతయు నాహారము లేకుండ సమీపమునందు న్న ప్రత్యరణ్యమును, ప్రతిగ్రామమును నారణ్యేకకై వెదకుచుఁ దిరుగఁజొచ్చెను. ఆరణ్యేక తమయింటికి వచ్చి కొలఁదికాలమైన ను, జగచ్చంద్రునకుఁగూడ నామెపై నెంతయోప్రేమ యుద యించెను. జనులసాహాయ్యసంపద లాతనికిఁ దక్కువగాలేవు. ఇదియునుగాక, రంగపురపుపోలీసుజనులందఱును నాతనియధీన మునం దుండిరి. ఆకారణమున నారణ్యేకను వెదకించుటయం దాతఁ డించుకంతయును లోపము చేయలేదు. సాయంకాల మున కందఱును నిష్ఫలప్రయత్నులై వెఱ్ఱిమొగములు వైచు కొని యింటికి వచ్చినపిమ్మట హైమవతి తండ్రికాళ్లపైఁబడి "అప్పా! నాయారణ్యేకను దీసికొనివచ్చి చూపుము" అని గోల పెట్టుచు దుఃఖింపనారంభించెను.

అదిచూచి యంతటి గాంభీర్యమును ప్రశాంతియును గల జగచ్చంద్రుఁడుగూడ విచలితుఁడై విశేషముగాఁ జింతింప నారంభించెను. ఆతఁడును జిన్నపిల్లవానివలె దుఃఖింపనారంభిం చెను. ప్రకాశచంద్రుఁ డింకను గృహమునకుఁ దిరిగిరాలేదు.

రాత్రి తొమ్మిది గంటలవేళ విషణ్ణవదనుఁడై యాతఁ డింటికిఁ దిరిగివచ్చెను. అప్పుడందఱును నారణ్యకవిషయమున హతాశులైరి.

రాత్రి పదునొకండుగంటలసమయమున బ్రకాశచంద్రుఁడు పరుండుటకై శయనాగారమునకుఁ బోయెను. ప్రభావతి యాతనికై కనుపెట్టికొనియుండెను. ఆమె ప్రకాశచంద్రునిఁ జూచి వేవేగముగ లేచివచ్చి "ఇంత వెదకినను దొరకక పోయినప్పు డిఁక నామెకొఱకు దుఃఖించిన నేమగును?" అనియెను.

ప్రకాశచంద్రుఁడు నిట్టూర్పువిడిచి "దుఃఖపడినచో నేమియును లాభములేదని యెఱుఁగుదును. కాని దుఃఖపడకుండుట యెట్లు? మంచిది—ప్రభా! ఆమెకొఱకుఁ గొంచెమైన నీమనస్సున నీవు దుఃఖించుటలేదా?" అనియెను.

ప్రభా—లేదు. దుఃఖపడుట కామె నాకేమగును?

ప్రకా—ఒకయడవిపక్షిని బెంచినను దానికొఱకు దుఃఖము కలుగునుకదా!

ప్రభా—పక్షికొఱకు నాకు దుఃఖము కలుగును. కాని యామెకొఱకుఁ గలుగదు. ఆమె యేయడవియం దుండెడిదో యాయడవికిఁ బోయినది.

ప్రకా—అది నిశ్చయముగాఁ దెలిసినచో నిశ్చింతుఁడనై యుండెదను!

ప్రభా—అది నిశ్చయముగాఁ దెలిసినచో సుస్థిరులై యుండెదరా ?

ప్రకా—నిశ్చయముగా నుండెదను.

ప్రభా—నేను మీకు నిజముచెప్పుచున్నాను—ఆమె యీయడవికే బోయియున్నది.

ప్రకా—నీ కెట్లు తెలియును ?

ప్రభా—నేనే యొకయుపాయమును బన్ని యామె నక్కడకుఁ బాపించితిని.

కూర్చుండియున్న ప్రకాశచంద్రుఁడు లేచి నిలుచుండెను. విస్మయసంబద్ధమైన యొక ప్రవాహ మాతనిశరీర మంతటను వ్యాపించిన ట్లయ్యెను. అతఁడు మిగుల నాత్రముతో “ఎంతటి కౌశలము ? ఏమియుపాయము ! అంతయును విప్పిచెప్పుము” అనియెను.

ప్రభావతి—చెప్పఁదొడఁగెను. “నేను మిమ్ము ఆరణ్యేక యేయడవియందుండు నని యడిగితిని జ్ఞప్తియున్నదా? ఆయడవినిగూర్చి తెలిసికొంటిని. మనసేవకుఁడు రామచరణుఁ డాయరణ్యము నెఱుఁగును. నే నాతని మూలమున నారణ్యేకతండ్రికి ‘అమావాస్యనాఁటియర్ధరాత్రివేళ నీకొమార్తెను నీవు పద్మపుష్కరిణియొద్దఁ జూడఁగలవు. ఆమె యక్కడకు వచ్చును.” అని వార్త నంపితిని. నిన్నటిరాత్రి యాపుష్కరిణినుండి పద్మములను దీసికొని రావలయు నని యారణ్యేక నక్కడకుఁ బంపితిని. తను

వాత నామె తిరిగి యింటికి రాలేదు. ఆమె యెక్కడకుఁ బోవును? ఆమెతండ్రియే యామెను నిశ్చయముగాఁ దీసికొని పోయియుండును." అని చెప్పెను.

ఇట్లుచెప్పి ప్రభావతి యొకసారి ప్రకాశచంద్రునిముఖమును జూచి "ఇట్లున్నారేమి? నేను చెప్పునది నమ్మటలేదా యేమి?" అనిప్రశ్నించెను.

ఆకస్మికముగాఁ దలపైఁ బిడుగుపడినవాఁ డెట్లు స్తంభితుఁడైపోవునో యట్లే ప్రకాశచంద్రుఁ డించుక సేపటివఱకు స్తంభితుఁడై తనభార్యముఖమును ఱెప్పవేయక చూచుచు నామె చెప్పుచున్న భయంకరవాక్యములను వినుచుండెను. పిమ్మట శక్తిహీనుఁడై మెల్లమెల్లగ నక్కడనే చదికిలఁబడిపోయెను; నోటినుండి యొక్కమాటయు వచ్చుటలేదు. మాట యెట్లు వచ్చును? అప్పు డాతనికంఠస్వరము రుద్ధమైపోయెను. దేహమునందుఁ బ్రాణమున్నదో లేదో సందేహామే.

ప్రభావతి యొకనిమేషములోఁ బ్రకాశచంద్రునియవస్థను గ్రహించెను. ఏయాశతో నీమాటలను భర్తకుఁజెప్పినదో యాయాశకు విపరీతఫలము కలుగుట చూచి భయముచేఁ గ్రుంగి మెల్లమెల్లగ నామె పతిచేతిని బట్టుకొని విస్మితనేత్రయై యాతనిమొగమువంకఁ జూడసాగెను.

కొంచెముసేపైనపిమ్మటఁ బ్రకాశచంద్రుఁడు మరల లేచి నిలుచుండి ప్రభావతిచేతిపట్టునుండి తనచేతిని విడిపించుకొని

యాగదినుండి వెలుపలికిఁ బోవుటకై ప్రయత్నించెను. ప్రభావతి యాతని నావలికిఁ బోనీయక యాఁపి "ఎక్కడకుఁబోయెదరు" అని యడిగెను.

ప్రకాశచంద్రునినోటినుండి చాలకష్టముతో "ఆరణ్యక యున్న స్థలమునకు" అనుమాటలు వెడలెను.

ప్రకాశచంద్రునికంఠస్వరమును వినుటచేఁ బ్రభావతిహృదయము కంపింప నారంభించెను. అప్పు డాతనిముఖ మొకగంభీరభీషణభావమును దాల్చియుండెను. ప్రళయమునకు ముందు ప్రకృతిమూర్తి యెట్లుగంభీరభావమును ధరియించి యుండునో యట్లె ప్రకాశచంద్రునిమూర్తియు గంభీరభావమును ధరియించి యుండెను. అయినను ప్రభావతి సాహసించి "నేను మిమ్ము విడువను." అనియెను.

ప్రకాశచంద్రుని యాగంభీరమూర్తి వెంటనే "నన్ను పట్టి నిలుపుట నీతరము కాదు." అని యుత్తరమిచ్చెను.

ఆగంభీరస్వరోచ్చలితమైనప్రభావతిహృదయము మరలఁ గంపించెను. అయినను నామెధైర్యమును వహించి "ఆమె మాయావిని—రాక్షసి—ఆమెయొద్దకుఁ బోవుట మీ కుచితమా?" అనియెను.

ప్రకా—ఆమె మాయావినియే కానిమ్ము—రాక్షసియే కానిమ్ము— నే నామెను ప్రేమించుచుంటిని. మొదట నాహృదయమును నేనే యెఱుంగకుంటిని—ఇప్పుడు తెలియవచ్చినది.

నీతప్పుకాదు—తప్పునాది—నే నామెను ప్రేమించుచుంటిని. ఆమె కింతటి విపత్తుకలిగినప్పుడు నేనూరకుండఁగలనా?

ప్రభా—అక్కడకుఁ బోయినచో మీకును విపత్తు కలుగును.

ప్రకా—ఆమెవిపత్తుముందు నావిపత్తు గడ్డిపోఁచయును గాదు.

ప్రభా—అదేమి! మీరు చెప్పినది నిజమేనా? కాక కల్పించి చెప్పుచుంటిరా ?

ప్రకా—నీకుఁ దెలిసియున్నంతకౌశలము నాకుఁ దెలియదు. నీ వింతచిన్నవయసునఁ బ్రాణసంహారకర మగునిట్టి భయంకరకౌశలము నెక్కడ నేర్చుకొంటివి? అరణ్యక యింకను బ్రదికియుండునా?

ప్రభావతి యింకను దత్తరపడసాగెను. ఆమెమనసునకును నొకవిధమైన యాతన కలుగఁజొచ్చెను. అయినను నామె యూరకుండ లేదు. మరల "ఆమెతండ్రి యామెను దీసికొనిపోయినాఁడు. ఆమె బ్రదికియుండ కేమి?" అనియెను.

ప్రకాశచంద్రుఁ డీసారి విసుఁగుకొనుచు "ఆమెనుగూర్చి నీతోఁ జర్చసేయుట నాకిష్టములేదు. నీవు చేసినపనికి నీముఖమును జూచుటకును నాకిష్టములేదు. అరణ్యక నుద్ధరింపలేకపోయినచో మరల నాముఖము నెవ్వరును జూడఁజాలరు" అని చెప్పెను.

ఇట్లుచెప్పి ప్రకాశచంద్రుఁడు విల్లునుండి విడువఁబడిన బాణమువలెనే యాగదినుండి చటాలున నీవలికివచ్చెను. ఈవలికివచ్చి యెదుట నొకస్త్రీమూర్తి నిలిచియుండుటను జూచి యక్కడనే నిలిచిపోయెను.

స్త్రీమూర్తి—ప్రకాశచంద్రా ! నేను నీమాటలనన్నిటిని వింటిని. ప్రభావతి యింతటిపని చేయఁగల దని నేను స్వప్నమునందును దలంచుకొనలేదు. నేనామె తెలివితక్కువపిల్లయని యనుకొంటిని. కాని, లోలోపల నింతటిదుష్టబుద్ధిగలదైయున్నదని తెలిసికొనుట యెట్లు ? జరగవలసినది జరగిపోయినది—ఇప్పుడు కర్తవ్యమేమో నేనుచేయఁగలను. కాని, నీవించుక తాల్మిని వహింపకున్నచో నంతయును పాడైపోవును.

ఇట్లుచెప్పిన యాస్త్రీమూర్తి మఱెవ్వరును గారు. ఆమె మన హైమవతియే. ఈదినమున హైమవతి కన్నుమూసికొనలేదు. ఆకస్మికముగఁ బ్రకాశచంద్రుని యుత్తేజితకంఠస్వరమును విని యీవైపునకు వచ్చెను. వచ్చినయామె ప్రకాశచంద్రుని శయనమందిరగవాక్షముచెంత నిలుచుండి లోపల జరుగుచున్నసంభాషణ మంతయును వినియెను. ప్రకాశచంద్రుఁడు చీఁకటిలో నామెను గుర్తింపఁజాలక పోయినను, మాటవచ్చడినిబట్టి తెలిసికొనియెను. ఆకంఠస్వరము స్వాభావికమైనదిగా నుండలేదు. ఆధ్వనియం దొకగంభీరశోకము మిళితమైయుండెను. హైమవతిమాటవిని ప్రకాశచంద్రుఁ డించుక స్తిమి

తపడి "నీవంతయును విన్నచో నీకక్కజరగవలసిన కర్తవ్యమేమో చెప్పుము ?" అనియెను.

హైమవతియు నదే శోకోద్దీపకస్వరముతో "ఇఁకఁ గర్తవ్యమేమున్నది? ఎట్లయిన నాయారణ్యక నుద్ధరింపవలయును. కాని, నరహత్యలనుగావించు నాబందెపోటుదొంగ చెంతకు నీ వొంటిగాఁ బోరాదు. మాజనకునియొద్దకుఁ బోయి యాతనితో నన్నిసంగతులను జెప్పవలయును. పిమ్మట నాతఁడు చెప్పినటులు చేయవచ్చును." అనియెను.

తరువాతఁ బ్రకాశచంద్రుఁ డాలసింపకుండ హైమవతితో జగచ్చంద్రునిశయనాగారమునకుఁ బోయి యాతనికి నిద్రాభంగము చేసెను.

---

## పదునాలుగవ ప్రకరణము.

---

రంగపురపుజిల్లాకుఁజేరిన నోరబుగంజిఠాణాయం దీదినమునఁ జాల సందడిగా నుండెను. ఇన్ స్పెక్టరుపానాఉల్లాసాహేబు మొదలుకొని రక్షకభటుఁడగు భాదాబక్షువఱకు నందఱకును విశ్రామమునకు సమయము లేకుండెను. నానావిధములగు నస్త్రశస్త్రములను తోమి పదనుపెట్టి సిద్ధము చేయుచుండిరి. తుపాకులసామగ్రినంతను బాగుచేయుచుండిరి. చౌకీదారు

లందఱును వచ్చి చేరుచుండిరి. తుపాకులు ప్రేలునో లేదో చూచుటకు ఠాణాయెదుట విమర్శించి చూచుచుండిరి. ఒక మూలఁ ద్రుప్పుపట్టి మంటిలోఁబడియున్న ఖడ్గములను సానపట్టుచుండిరి. ఒకదిక్కున బల్లెములకును, అలుగులకును, మఱింత పదను బెట్టుచుండిరి. అక్కడఁగూడియున్న గ్రామరక్షకభట సమూహమును, తలారులును, చౌకీదారులును నందఱునునోరు తెఱచుకొని చూచుచు నిలువఁబడియుండిరి. వారియస్త్రములు చేపాటికఱ్ఱలై యుండెను. అవియన్నియు నొకవిధమైన యాయుధములవలె నున్నను వారలదేహశక్తిమాత్ర మొకేవిధముగా లేదు. వారిలో క్షీణించి శీర్ణకాయులై యున్న వృద్ధులు మొదలుకొని దృఢశరీరములుగల బలిష్ఠయౌవనపురుషులవఱకు నందఱు నాగుంపునఁ జేరినవారే. వారందఱును ఠాణాకెదురుగానున్న బయలులోఁ గూరుచుండి యుద్ధసంబంధములగు పోలీసువారి యాయోజనముల నాశ్చర్యముతోఁ జూచుచుండిరి. వారిలోఁ గొందఱు పొగాకును దీసికొని తాను కొంత నైచుకొని యితరులకుఁ గొంతయిచ్చుచుండిరి. కొంతమంది జరగుచున్న పనులనుగూర్చి నానావిధములగు చమత్కారవాక్యములఁ జెప్పికొనుచుఁ జట్టును చేరియున్నవారిని మోహపెట్టుచుండిరి. ఒక యౌవనపురుషుఁడు వృద్ధుఁడగు మఱియొక చౌకీదారునుగూర్చి "దొరగారీయినస్పెక్టరుగారిమూలమున మనలనందఱ నెందులకు బిలిపించిరో తెలియునా?" అని యడిగెను.

వృద్ధు—తెలియ కేమి? నీవు పిల్లవాఁడవు. నీ కేమి తెలి
యును? మేజస్ట్రీటుదొరగారు వేఁటకుఁ బోవుచున్నారు. మన
మందఱ మాయనతోఁ బోవలయును.

యువ—మన మేమి చేయఁగలము ? ఏమి చేయవల
యును ?

వృద్ధు—అడవియంతయుఁ గొట్టివేయవలయును. అంత
పని జరుగునో జరగదో తెలియకుండ నున్నది.

అప్పుడు మఱియొకప్రౌఢుఁడు "ఓహో! అడవిలోఁ
దిరుగుచున్నచో మన కాహారమో? పొట్ట నిండుట యెట్లు ?"
అనియెను.

వృద్ధు—ఆహారము నిచ్చువాఁడు భగవంతుఁడే. ఇన
స్పెక్టరు పిలిపించినప్పుడు పొట్టకుఁగూడనా ?

యువకుఁ డించుక రసికతతో "అడవిలో నున్నది తిన్న
చోఁ బొట్టనిండును." అనియెను.

మేజస్ట్రీటుదొరవారు వేఁటాడునప్పుడు వారికిఁగలుగఁ
బోవువిశేషాపాయములనుగూర్చి యలంకారయుక్తములగువర్ణ
నములుకూడ జరగెను. వర్ణించుచున్న వానిచుట్టునుగూర్చుండి
మఱికొందఱుచౌకీదారులును రైతులును వేఁటాడఁబోవుచున్న
యజమానునిపేరత్వాదులను గీర్తించుచుండిరి. వారందఱు నిక్క
డఁగూడుటకు కారణ మీవిధముగా నూహింపఁబడియుందఱకు

నట్టినష్టకమే కలిగెను. ఇనస్పెక్టరుగారి కీవిషయమున నెట్టిసమా చారమును దెలియలేదు. మేజస్ట్రీటువా రాతనికి మఱెట్టిసంగతి యును జెప్పియుండలేదు. ఆతఁడు మేజస్ట్రీటుగారి యాజ్ఞానుసార ముగా నిట్టిసన్నాహమును జేయుచుండెను. జగచ్చంద్రుఁడు, ఇన స్పెక్టరునకుఁ దెలియఁజేసినదేమనఁగా- నేఁటి మధ్యాహ్నోత్తర మున మూఁడునాలుగుగంటలలోపున రక్షకభటులలోను, చౌకీ దారులలోను, యానములును, బలాఢ్యులునగునిన్నూఱుమంది యొకవిశేష కార్యముకొఱకు నాతో దూరదేశమునకుఁ బోవు టకు తాణాయందు సిద్ధముగా నుండవలయును. నీవుకూడ స్టేష నులోని పనుల నన్నిటిని రెండుమూఁడు దినములవఱకును హె డ్డుకానిస్టేబిలున కొప్పగించి నాతో రావలయును. తుపాకులు ను, కత్తులును, బల్లెములును, ఎన్నిదొరికిన నన్నియు సిద్ధముగా నుంచుకొనవలయును. నేను కచ్చేరీపనులను పూర్తిచేసికొని కొంచె మెచ్చుతగ్గుగ నొంటిగంటకు తాణాకు వచ్చెదను.” అనిచె ప్పెను. ఆకారణమున నేయుద్దేశముతో నెక్కడకుఁ బోవలయు నోమాత్ర మినస్పెక్టరునకును దెలియదు. ఆతని కుదయమునఁ దొమ్మిదిగంటలవేళ మేజస్ట్రీటుగారియాజ్ఞ యయ్యెను. ఆవెంట నే కాలమును వృథపుచ్చక యన్నియును సిద్ధపఱిచి రెండుగం టలవేళ నినస్పెక్టరు హెడ్డుకానిస్టేబిలును జూచి “రామలాల్ ! ఇప్పు డంతయును సిద్ధముగా నున్నది. ముందుజరుగఁబోవు పని మాత్ర మింకను దెలియలేదు” అనిచెప్పెను.

రామ—ఒకబందెపోటుదొంగను బట్టుకొనుటకై పోవలసియున్నదని తోఁచుచున్నది.

ఇన—దొంగలగుంపెంతటిదైననేమి ? వారినిపట్టుకొనుటకు మనము చాలమా? జగచ్చంద్రునివంటి సమర్థుండగునొక మేజస్ట్రీటు ఈమాత్రపుఁ బనికెందులకు రావలయును ? దీనికేదియో యాంతరికమర్మ మున్నదని తోఁచుచున్నది. అది భగవంతునికే తెలియును.

రామ—మర్మమేమి యుండును ? ఎక్కడనో యొక్క గొప్పబందిపోటు జరగినదని తోఁచుచున్నది. మేజస్ట్రీటాసమాచారము నెవ్వరినుండియో విని యుండును. ఆగుంపునంతను నొకేసారి ముట్టడివేయవలయుననియే మేజస్ట్రీటుగారు స్వయముగా బయలుదేఱి వచ్చుచున్నారని తోఁచుచున్నది.

ఇనస్పెక్టరిరువదివత్సరములనుండి పోలీసులోఁ బనిచేయుచుండెను. రామలాలుకంటె నిట్టిపనులలో నాతనికి విశేషానుభవ మున్నది. ఆతఁడు హెడ్డుకానిస్టేబిలుచెప్పిన మాటకుఁ దలనూచుచు “ఇప్పుడు బందెపోటులు జరుగకుండ దొంగలను బట్టుటకై పోవుచున్నారని నేను యోచింపను. అక్కడ నొక దొంగలగుంపున్నది. మేజస్ట్రీటుగారే స్వయముగ నాసమాచారమును దెలిసికొని యాగుంపును బట్టుటకై పోవుచున్నట్లున్నది” అనియెను.

ఈవిధముగా సంభాషించుకొనుచు నినస్పెక్టరు రామలాలునకు ఠాణాపని నంతను నొప్పగించెను. మఱియు ఠాణాయందు నిలువయున్న ఫిర్యాదులలో ముందు జరుపవలసిన వ్యవహారములనుగూర్చి యాతనికి బోధించెను. ఈసమయమున జగచ్చంద్రుఁడు ప్రకాశచంద్రునితో నక్కడకువచ్చెను. వారితో రామచరణుఁడుగూడ నుండెను. జగచ్చంద్రుఁ డినస్పెక్టరుతో నేకాంతముగాఁ గొన్నిసంగతులనుగూర్చి మాటాడి, ఠాణాయొద్దకుఁ జేరినవారిలో నిన్నూఱుగురుభటులు మొదలగువారి నేర్చి తీసికొని వారియాయుధము లన్నియు సరిగా నున్నవో లేవో బాగుగఁ బరీక్షించి పిమ్మట వారి నందఱను దీసికొని సరిగా మూఁడుగంటలకు ఠాణానుండి బయలుదేఱెను.

---

## పదునైదవప్రకరణము.

---

ఆరణ్యేక యా పద్మపుష్కరిణిసమీపమున నారాత్రి మెఱుపులవెలుగునఁ గాలాంతకసమానుఁడగు నెట్టిమనుష్యమూర్తినిఁ జూచియుండెనో యామనుష్యుఁ డారణ్యేకతండ్రి యగు కిషణలాలే యైయుండెను. అతఁ డారణ్యేకనుజూచి యాఁకలితోనున్న పులివలెనే యొక్కపరుగునవచ్చి యామెపైఁబడి కాలుసేతులను గట్టివైచి బుజముపై నెక్కించుకొని యూర్ధ్వశ్వాసముతో నక్కడనుండి పరుగెత్తుకొనిపోయెను. ఆరణ్యేక తనతండ్రిశక్తిని నడతను బాగుగ నెఱిఁగియున్న కార

ణామున నాతనికి మఱిమెట్టి ప్రత్యుత్తరము నీయకూరకుండెను. వెలుఁగువచ్చుటకు ముందుగనే కిషణలా లరణ్యమునందున్న తనయింటికిఁ జేరుకొనియెను. ఇంటికిఁ జేరినతోడనే వెలుఁగు వచ్చువఱకు నారణ్యిక నొకగదిలో నుంచి పైనిబీగము వైచెను.

వెలుఁగు వచ్చినపిమ్మట కిషణలా లారణ్యికను గదిలో నుండి యీవలికిఁ దీసికొనివచ్చి కట్టులు విప్పివైచి ప్రేమపుర స్సరముగా "ఆరణ్యికా! నీవు నాపుత్రికవై యుండియు నన్ను విడిచి వెడలిపోఁదగునా తల్లీ !'' అనియెను.

ఆర—నీవు జనులను జంపుట చూడఁజాలను. తండ్రీ ! ఆకారణమునఁ బాఱిపోయితిని.

కిషణలాలు తనతనయ నిర్భయముగాఁజెప్పిన యీమాట కించుక కోపించుకొని "నేను జనులను జంపుచున్నానని నీ కెవ్వరుచెప్పినారు?" అనియెను.

ఆర—(భయపడకయె) నీవు మనుష్యులను జంపుట నేను చాటున నిలుచుండి నీనోటినుండియే వినియున్నాను.

కిష—ఆమాటల నట్లుంచుము. నిన్నొకమాట యడుగు చున్నాను—ఇక్కడ కారాత్రి వచ్చినయాతఁడు నీకు మర్భోధ చేసి నీమనసు విరిచి తీసికొనిపోయెనా లేదా ?

ఆర—ఆతఁ డట్లు చేయలేదు. నేనే యాతని దీసికొని పోయితిని.

కిష—నీ వాతనిని నీతోఁ దీసికొనిపోవనిచో నేను చంపి వేసియుందును.

ఆర—అది యెఱింగియుండియే నే నాతనిఁ దీసికొని పోయితిని.

ఈసారి కిషణలాలు హెచ్చుకోపముతో "అంతవలన నీకేమి లాభము కలిగినది? అతనివలన నీ కేమగుచు? ఆతనికొఱకు నీవెంతగాల కింతపని చేసితివి?" అనియెను.

ఆరణ్యైక యీప్రశ్నముల కెట్టిప్రత్యుత్తరము నీయక తలవంచుకొని స్థిరభావముతో నిలిచియుండెను. కిషణలాలు మరల "ఆతఁ డెక్కడ నున్నాఁడు? ఆతని పేరేమి? అంతయును విశదముగాఁ జెప్పుము." అనియెను.

ఆరణ్యైక పెదవి మెదపలేదు. కిషలాలు మరల గర్జించుచు "నీవంతయును విస్పష్టముగాఁ జెప్పకున్నచో నిన్ను మిగులఁ గ్రూరముగా దండించెదను. ఆతఁ డెక్కడ నుండును? ఆతని పేరేమి? మెల్లగాఁ జెప్పుము." అనియెను.

ఆరణ్యైక మొదటివలెనే నిరుత్తరయై యుండెను. కిషణలాలు కోపముతోఁ గన్ను లెఱ్ఱచేసికొని "నీవు మాటాడకుండ నూరకుందువేమి? నీ వాతనిపరిచయ మంతయుఁ జెప్పెదవా లేదా? చెప్పవేమి?" అని గర్జించి పలికెను.

కొంతసేపైనపిమ్మట నారణ్యైక మెల్లమెల్లగ "నేనాతని పరిచయమునుగాని, ఆతని సమాచారమునుగాని చెప్పఁబోను." అనియెను.

కిషణలాలు క్రోధాంధుఁ డయ్యెను. కృద్ధుడై యున్న యాతని యప్పటిమూర్తి మిగుల భయంకరముగా నుండెను. దంభముతో పండ్లు పటపటఁగొఱుకుచు "నీకింత ధైర్యమా? ఒక్క వ్రేటుతో నిన్ను నఱికి పాఱవైచెదను." అనియెను.

ఆరణ్యైక యించుకయును భయపడక స్థిరభావముతో "నన్నుఁ జంపినను జంపుము. మఱియేమిచేసినను జేయుము. కాని యాతనివిషయమై యించుక సమాచారమైనఁ జెప్పఁబోను." అనియెను.

కిషణలాలు క్రోధమునో నున్మత్తుఁడై యొకనిమిష మారణ్యైకతలను రెండుచేతులతో నుబట్టి యదిమి మీఁది కెత్తెను. అందువలనఁగూడ నారణ్యైక యెట్టిగందరగోళమును జేయక యె నిర్భయముగా నూరకుండెను. మీఁదినుండి యట్లే యొకవైపు నకు విసరివైచినచో నారణ్యైకజీవితము నిశ్శేషమైయుండును. కాని కిషణలాలున కేదియో యోచనగలిగి యామెనొకవైపు నకు విసరివైవక యట్లే తీసికొనిపోయి యొకయింటిలోఁ గట్టి పడవైచి దానికి బీగమువైచెను. ఆపగలంతయు నారణ్యైక యాగదియం దాహారము లేకుండనుండెను; సాయంకాలమునం దామెనట్లే కట్టతో నీవలికిఁ దీసికొనివచ్చెను. అప్పుడు భూషణ లాలు, విష్ణుదయాళువు మొదలగు నైదాఱుమందికూడ నుండిరి. కిషణలాలు వారినందఱినిఁ జూచి "మీరు చేయఁగలిగినదిచేసి దానినోటినుండి యామాట వినిపించుఁడు." అనియెను. వారం

దఱు నామె కనేకవిధములఁ జెప్పిచూచిరి. కాని, యారణ్యైక యెంతమాత్రమును జెప్పుట కిష్టపడ లేదు. కిషణలాలునికోపము భయంకరముగా వృద్ధిఁబొందసాగెను. ఆతఁడు రోషకషాయిత లోచనుఁడై గర్జనముసేయుచు "అన్నమును బట్టయు నిచ్చి పెంచి పెద్దదానిని చేసినందుల కిన్నినాళ్లు సహించి యూరకుంటిని. ఇఁక సహించి యుండఁజాలను. నేఁడు మీయందఱిసమక్షమునను నే నీమెను చంపి పాఱవైచెదను. ఇంత పిల్లయే యంతగా నవిధేయురా లైనప్పుడీఁక నితరులు నామాట విందురా!" అనియెను.



ఆరణ్యైక స్థిరస్వరముతో విస్పష్టముగా "అప్పా! నీవు నన్నుఁజంపివైచి నీపాపభారమును మఱింతవృద్ధిచేసికొనవలదు. నామరణము నీకిష్టమైనచో నేనే స్వయముగాఁ బ్రాణములను విడుచుటకు సిద్ధముగా నుంటిని." అనియెను.

కిషణలాలు పిచ్చివానివలెఁ జీత్కారముసేయుచు "అట్టె పట్టిచావు కాదా. నేను నిన్నుఁ గొంచెముకొంచెముగాఁ గాల్చి చంపెదను" అనియెను.

ఆరణ్యైక యామాటనే "నీ వెందుల కాపాపమును బొందుచు కొనుదవు? నేనే యగ్నిలోఁబడి ప్రాణములను విడిచెదను." అనియెను.

ఇట్లుచెప్పి యారణ్యైక, తనయెదుట మండుచున్న కొఱవి పాలకఱ్ఱుమంటలోనికిఁ జేయిచాఁచెను. అదిచూచి యక్కడ నున్నవారందఱును స్తబ్ధులైపోయిరి. కిషణలాలుతప్పఁ దక్కిన వారందఱు "ఏమిపనిచేయుచుంటివి ? ఏమిపనిచేయుచుంటివి ?" అని యఱచుచు నామె నక్కడనుండి దూరముగఁ దీసికొనిపోయిరి. చేయి విశేషముగాఁ గాలినను నామెముఖమున నించుకంతైన బాధ ననుభవించుగుఱుతైనఁ గనఁబడకుండుట కందఱు నాశ్చర్యపడఁజొచ్చిరి. కాని కిషణలాలుకుమాత్ర మాశ్చర్యమునకు బదులుగాఁ గ్రోధము హెచ్చయ్యెను. అప్పుడాతఁడు కన్నులనుండి యగ్నికణములను రాల్చుచు గర్జించి "ఆమెయే స్వయముగాఁ జచ్చినచో నా కీమేలిమంట చల్లాఱును. నే నామెను నాచేతులాఱఁ జంపి శాంతినొందెదను." అనియెను.

ఇట్లుచెప్పుచుఁ గిషణలాలొక పెద్దబెత్తమును దీసికొని దానితో నారణ్యైకను గొట్టనారంభించెను. ఆదెబ్బలవలన నామె శరీరమంతయు గాయములై రక్తము స్రవింప నారంభించెను; అయినను నాఁగక మరల నదేవిధముగాఁ గొట్టుచుండెను; ఎంత కొట్టినను, ఆరణ్యైకనోటినుండి యొక్కమాటయైన బయలుపడలేదు. అదిచూచి తక్కినదొంగలందఱును ధైర్యముతోఁ గిషణలాలునిష్టమునకు వ్యతిరేకముగా నొక్కమాటయైనఁ జెప్పలేక పోయిరి.

ఈవిధముగా నోడలు తెలియకుండ బాదుటచేఁ గిషణ లాలునికోప మించుక శమించెను. పిమ్మట నాతఁ డారణ్యైకను మరలఁజూచి "ప్రాణములపై నాశయున్నచో నిప్పుడైనఁ జెప్పుము. నీవెవ్వరితోఁ బాఱిపోయితివి? చెప్పకున్నచో నీవు నాచేతులనుండి బ్రతికి పోఁజాలవు" అనియెను.

ఆరణ్యైక యామాటకుఁ బ్రత్యుత్తరముగా స్థిరకంఠస్వ రముతో "నాశరీరములోఁ బ్రాణములున్నంతవఱకు నాసంగతి చెప్పను. నాకుఁ బ్రాణములపై నాశయును లేదు. న న్నిప్పుడే చంపివేయుము" అనియెను.

కిషణలాలు క్రోధముతో నున్మత్తుఁడై "ఇంత యైనను నింకను ధైర్యమేనా. మంచిది. ఇఁక నీవు బ్రదుకఁజాలవు" అని చెప్పి బాణమువలె తీవ్రమున నింటిలోనికిఁ బోయి యొఱనుండి తీసినకత్తిని జేతితోఁ బట్టుకొనివచ్చి యెదుటనిలిచెను; చూచు చుండఁగనే కత్తిని మీఁదికెత్తెను. అప్పు డారణ్యైకప్రాణములపై నిరాశ చెందెను. కఠినహృదయులగు తక్కినదొంగలందఱును భయముచే వడవడవడఁకసాగిరి. ఆరణ్యైక యప్పుడుగూడ స్థిర చిత్తముతో నీరవయై ధైర్యముతో నిలుచుండియుండెను. ఇఁక నాలస్యములేదు. పైకెత్తినకత్తి యిఁకనొకనిమిషములో నారణ్యైక కంఠముపైఁబడిపోవును. కాని, యిదియేమి! ఆనిమిషమున వందల కొలఁది పోలీసుజవానులును, చౌకీదారులును నాకస్మికముగా నాలుగుదిక్కులనుండియును వచ్చి ముట్టడివైచి కిషణలాలుని,

ఆతనిగుంపులోనివారినిగూడ పట్టి బాధించివైచిరి. ఈయాకస్మి కాక్రమణముచేఁ బైకెత్తినకత్తి కిషణలాలునిచేతినుండి క్రిందఁబడి పోయెను. నిరస్త్రులైయున్న యాతనిజతగాండ్రు కొయ్యలవలె నైపోయిరి. ఈయాకస్మికఘటన మొకనిమిషమాత్రములో జరిగిపోయెను.

ఈకార్య మింతసులభముగా ముగింపఁబడునని యెవ్వరు నూహించుకొని యుండలేదు. జగచ్చంద్రుని బుద్ధికౌశలముచే నింతసులభముగా జరిగిపోయెను. ప్రకాశచంద్రుని జూచి కిషణ లాలు గుర్తుపట్టెను. ఆతఁడే తనచేటునకు మూలకారణుఁడని తెలిసికొని యెఱ్ఱవడినకన్నులతో నాతని నతిక్రూరముగాఁ జూడసాగెను. ఆరణ్యైక యావెంటనే జగచ్చంద్రునిఁ బ్రకాశ చంద్రునిఁ జూచి గుర్తించెను. కాని యప్పుడామె యానందమును బ్రకటింపక శూన్యబుద్ధియై నిలిచియుండెను.

ఆరణ్యైక జీవించియుండుటను జూచుటచేఁ బ్రకాశచం ద్రునియానందమునకుఁ బారమే లేకపోయెను. ఆతఁ డారణ్యైక యొద్ద కొక్కఁ పరుగునఁ బోయి యామెబంధములను విప్పివైచెను. జగచ్చంద్రుఁడు, కిషణలాలు మొదలగువారి చేతులు విరిచి కట్టించి వారికి సంకెలలు దొడుగుట కాజ్ఞాపించెను. ఆజ్ఞయైన వెంటనే పదిపదునైదుగురు భటులువచ్చి వారినందఱిని గట్టివైచి వారికందఱకును సంకెలలనువేసిరి. పిమ్మట జగచ్చంద్రుఁడు కిషణలాలునుజూచి "నీపేరు కిషణలాలా ? నీవే యీదొంగల

కందఱకును యజమానుఁడవుగావా ? నీ వేమైనబలప్రకాశము చేసి చిక్కుపెట్టఁజూచినచో వెంటనే నిన్నుఁ గాల్చి వేయుటకు నేను వెనుదీయను. ప్రాణములతోనున్న నిన్నుఁగాని నీమృతక ళేబరముఁగాని దీసికొనిపోవుటకు నాయొద్దననేకభటులున్నారు" అని చెప్పెను.

కిషణలాలు గర్జించుచు "నేను మృత్యువునకు భయపడు వాఁడఁగాను" అని, "జనులనూరకను జంపినపిమ్మటఁ జచ్చుటకు నాకెట్టికొంఱతయును లేదు." అనియెను.

జగచ్చంద్రుఁడు నవ్వి "ఈసీకొంఱత యీజన్మమునందు దీరునదికాదని మిగుల విచారించుచున్నాను" అనియెను.

కిషణలాలు మరల గర్జించుచు "నన్నీదినమున పట్టిబంధించినవా రెవ్వరో తెలియుట కాశపడుచున్నాఁడను" అనియెను.

జగ—బ్రిటిషుసర్కారువారి యాజ్ఞప్రకారము నీవు బాధింపఁబడితివి.

కిష—సర్కారుబహదూరులకు నే నేమియపకారము చేసితిని ?

జగ—నీవు బందెపోటుదొంగవు—నరహంతకుఁడవు. మఱియు దుర్మార్గప్రవర్తకుఁడవు. నీ వనేకపాపములను జేసిన యపరాధివి. నీయపరాధ మేదియని చెప్పను ?

కిష—నే నెక్కడ బందిపోటువైచితిని ? ఎవ్వరిని జంపితిని ? ఏదుర్మార్గపుఁబని చేసితిని ?

జగ—కోర్టువం దవియన్నియును రుజువునకువచ్చును లే. ఇప్పుడు నాకన్నులయెదుట నీపిల్లను ఖూనీ చేయఁబోవుచుంటివిగాదా ?

కిష—ఆమె నాకన్నబిడ్డ. నాబిడ్డను నాయిష్టమువచ్చినట్లు చేసికొందును.

జగ—నీబిడ్డను ఖూనీచేయుటకు నీ కధికారము లేదు.

పిమ్మటఁ గిషణలా లేట్టిప్రత్యుత్తరమును జెప్పకయె పంజరాబద్ధమైన సింహమువలె క్రోధోద్దీపితుఁడు కాఁజొచ్చెను. నడుమనడుమఁ బ్రకాశచంద్రునిపైఁ దీక్ష్ణదృష్టిని బరగించుచుండెను.

పిమ్మటఁ బోలీసుజనులు జగచ్చంద్రునియాజ్ఞానుసారముగా వారువారు తీసికొనివచ్చిన కాఁగడలు మొదలగునవి వెలిగించిరి. చూచుచుండఁగనే యంధకారమయమైయున్న యాయడవియంతయు వెలుఁగయ్యెను. ఆవెలుతురులో బందెపోటు దొంగల భయంకరమూర్తులు మఱింతభయంకరముగాఁ గానఁబడుచుండెను. ఈసమయమున జగచ్చంద్రుఁడు కిషణలాలుని యింటియందున్న యస్త్రాదులను, అమూల్యములగు నితరవస్తువులను వెదకి తీసికొని రావలసినదని యాజ్ఞాపించెను. దొంగల యాయుధము లన్నియు దొరకిపోయెను. కాని, వెలగలద్రవ్య

మేమియు నక్కడదొరకలేదు. అప్పుడు జగచ్చంద్రుఁడు కిషణ లాలునిజూచి "కిషణలాల్! నీ వింతవఱకు నెన్నియో బందెపో టులను వైచి ఖూనీలనుజేసి విశేషద్రవ్యమును వెలగల వస్తువు లను దోచుకొని యుంటివి. అవి యన్నియు నిప్పటికి నీస్వాధీన మునందే యున్నవి. వాని నన్నిటిని నీయింటియందో కాక యీయడవియందో దాఁచియుందువు. అవి యెక్కడనున్నవి ? ఇష్టమున్నచోఁ జెప్పుము." అనియెను.

కిషణలాలు నిర్భీకచిత్తముతో "మీరు దొంగలపై బడి బందెపోటులు వేయువారివలె నున్నారే ?" అనియెను.

జగ—మనఃపూర్వకముగాఁ జెప్పుట కిష్టము లేనట్లు తోఁచుచున్నది. హింస కలిగినచో నీయంతట నీవే చెప్పెదవు.

కిష—అదియును బందెపోటుదొంగ కలవాటే. అది యు నాతఁ డెఱుఁగును.

జగ—అల్లొటింగియున్నచో వ్యర్థముగాఁ గష్టపడుట యెందులకు?

కిష—హింస నెంతవఱకు సహింపఁగలనో మీకుఁజూ పుట కిష్టపడుచున్నాను. మీరెన్నాళ్లనుండి పోలీసులోఁ బని చేయుచున్నారు?

జగ—నేను పోలీసుపనిలోనివాఁడనువాను. నేనిప్పటి కిరువదిసంవత్సరములనుండి డిప్యూటిమేజస్ట్రీటుపని చేయు చుంటిని.

కిష—అందువల్లనే చట్టములజ్ఞాన మింతగా మీకున్న దని తోఁచుచున్నది. ఏయాక్టు ప్రకారము మీరు నన్ను హింసించి దొంగసొత్తును బైటఁబెట్టఁగలరు?

జగచ్చంద్రుఁడు మొదట నించుక కోపమూని పిమ్మట “దొంగసొత్తు దొరకకపోయినను నీవంటి బందిపోటుదొంగల ననేకులను దండించి యుంటిని” అని చెప్పెను.

కిష—అదంతయును చిల్లరదొంగలవిషయమైనది. బందిపోటుదొంగను దండించుటకు మీకధికార మున్నదా?

జగ—అధికార మున్నదో లేదో ముందు నీకుఁ దెలియును.

కిష—నన్ను విచారింపఁదగినవాఁ రెవ్వరు?

జగ—నేను విచారణను చేయుదును.

కిష—ఫిర్యాదు రుజువైనచో శిక్ష విధింతురా?

జగ—నిన్ను సెషన్ కోర్టునకు కమిటు చేయుదును.

కిష—సెషనునకుఁ బంపినచో శిక్షకాదు. సెషన్ కోర్టునందు నేను సులభముగా సంతోషముగా విడుదలయయ్యెదను. అందువలననే మీరు నాపైఁ జేయిచేసికొనరాదని చెప్పుచున్నాను. నన్ను శిక్షించుటకు మీకధికారమును లేదు.

కిషణలాలుమాటలను విని జగచ్చంద్రుఁడు మరలఁ గోపమును వహించెను. ఒకసామాన్యచోరునిమాటలవలన నిట్లు

రెండుమూఁడుసారు లప్రతిభుఁడగుటకు మనసున లజ్జించెను; ఆ తఁడు సాధారణచోరుఁడు కాఁడనియుఁ దెలిసికొనియెను. పిమ్మట నాతనితో నేమియు మాటాడకయె, ఇనస్పెక్టరును జూచి దొంగసొత్తును వెదకవలయు నని యానతిచ్చి కావలసినభటులను దీసికొని బయలుదేఱెను. ప్రకాశచంద్రుఁడును నారణ్యికయు నాతనితోఁ బోయిరి.

---

## పదునాఱవ ప్రకరణము.

---

రంగపురమండలమున బందెపోటుదొంగయగు కిషణలాలుపే రనేకులకుఁ దెలియును. కాని, కిషనలా లెక్కడనుండునో యనునది యిదివఱకెవ్వరు నెఱుఁగరు. అనేకు లాతని మలదాసీమవాఁడనియనుచుండిరి. కొంద ఱాతఁడు రాజశాహీ యందుండు నని చెప్పుదురు. మఱికొంద ఱాతఁడు దినాజపుర వాసి యని నిశ్చయముగా నమ్మియుండిరి. కాని, కిషణలాలు రంగపురమండలమునందే యుండి యాజిల్లాలన్నిటిలోను బందెపోటులు వైచుచుండె నని యెవ్వరు నూహింపలేదు. అందువలనఁ గిషణలా లాతనిగుంపువారితోఁ బట్టుపడిరంగపురమునకుఁ దీసికొనిరాఁబడినప్పుడు రంగపురమున విశేషకోలాహలము బయలువెడలెను. కిషణలాలును జూచుటకు జనులు గుంపులు

గుంపులుగా రాణాకు వచ్చిపో నారంభించిరి. ఇట్టిదొంగలగుంపును గనుపెట్టి పట్టుకొనుటచే జగచ్చంద్రునకు సర్కారునుండి మంచిబహుమానము వచ్చెను. జనులుకూడ నాతనిస్తుతించిరి. ఆతఁ డేసందర్భమునఁ గిషణలాలును వెదకిపట్టుకొనియెనో ఇంతసులభముగాఁ బ్రసిద్ధుఁడగు నొకదుర్దాంతచోరుని, అట్టిదుర్గమమైన యడవియం దెట్లు పట్టుకొనియెనో, అనునీయంశము లెవ్వరికిని దెలియవు. ఆకారణమున జగచ్చంద్రుఁడు కేవలమును మండలశాంతిరక్షణముకొఱకుఁ బ్రయత్నించి యిట్టి దుస్సాధ్యకార్యమును జేసె నని యందఱు ననుకొనసాగిరి.

జగచ్చంద్రుఁడు కిషణలాలుని సరియైన కాపుదలలో నుంచుటకుఁ దగినయేర్పాటులను గావించి ప్రకాశచంద్రుఁడు నారణ్యిక మొదలగువారితో నింటికిఁ దిరిగివచ్చెను. ఆబ్రాహ్మణుఁ డింటిలోఁ గాలుపెట్టుచు "హైమవతీ! ఎక్కడనున్నావు తల్లి! ఇదిగో నీయారణ్యిక. తీసికొనివచ్చితిని" అని యానందముతోఁ గేకవైచి చెప్పెను.

హైమవతి యప్పుడు లోపలమంచముపైఁ బరుండి యేమేమియో యోచించుకొనుచుండెను. ఆమె యాకస్మికముగ దండ్రిచెప్పిన శుభవార్తను విని సంభ్రమముతో లేచి నిలువఁబడియెను. ఆమె యాత్రముతోఁ బరువెత్తుకొని వచ్చుటలోఁ గాలుజాఱి క్రిందబడిపోయెను. ఆపడినపాటున కామెకాలునకు గొప్పగాయము కలిగెను. కాని దానినామె లక్ష్యము

సేయలేదు. పడినయామె వెంటనే తడవుకొనకుండ లేచి "అప్పా! ఆరణ్యైకయెక్కడ?" అని కేకవేయుచుఁ దండ్రియొద్దకువచ్చి నిలిచెను. తండ్రి కొమారిత జారిపడినశబ్దమును దూరమునుండి వినియెను. విన్నవెంటనే యాతఁడు వ్యాకులచిత్తుఁడయ్యెను. కాని యాయుత్తరక్షణముననందే తనయ తనయొద్దకుఁబరుగెత్తుకొని వచ్చుటనుజూచి యాతనివిచారము దూరమయ్యెను. అయినను నాతఁ డామెముఖమును జూచెను. ఆసమయమునం దా ప్రఫుల్లవదనకమలమున నాహ్లాదచిహ్నములు తక్క మఱేమియును గోచరింపలేదు.

హైమవతి. యెదుట నిలిచియున్న యారణ్యైకను బహుశ్రమముతో నాలింగనము చేసికొనియెను; ఆలింగనము చేసికొని యానందముతో నేడువసాగెను. హైమవతి యేడ్చుటను జూచి యారణ్యైకయు నేడువఁదొడఁగెను. ఆరణ్యైక యిప్పుడా మొదటియారణ్యైకవలె లేదు. ఆమె కొంతకాలము సంసారమునం దుండి యందలికొన్ని సుఖదుఃఖములకు వశీభూతయై యుండెను. హైమవతి యారణ్యైకకన్నీళ్ళను దుడిచి యింటిలోనికిఁ దీసికొనిపోయెను.

ఇఁకఁ బ్రభావతియో ? ఈసమయమున మనప్రభావతి యెక్కడకుఁ బోయినది ? ప్రభావతి యారణ్యైకయాగమన సమాచారమును విని పరుగెత్తుకొనిపోయి తన శయనగృహము

నఁ బ్రవేశించి లోపల గడియవై చుకొనియెను. ఆమె హృదయ
ము దడదడఁ గొట్టుకొనసాగెను. ఆమెకంఠమును నాలుకయు
నెండిపోయినవి. తానొక యన్యాయకార్యమును జేసితినని
యామె మిగుల లజ్జింపఁ దొడఁగెను. ఆలజ్జవలన నామె యా
గదినుండి యీవలికి రాకుండఁ బోయెను.

మామగారియింటికి వచ్చినదిమొదలు ప్రకాశచంద్రుఁ
డు ముందున్న కచ్చేరీచావడియందే నివసించుచుండెను. లోప
లికిఁబోవుట కాతనికి ధైర్యము కలుగలేదు; మధ్యాహ్నకాల
మున భోజనమునకు రమ్మని బలవంతపెట్టినమీఁదట లోపలికిఁ
బోయెను; కాని, మిగుల సంకోచపడుచు భయముతో దొంగ
వలె లోనికిఁబోయెను. ఆరణ్యికకూడఁ బ్రభావతియున్నవైపు
నకుఁ బ్రయత్నపూర్వముగాఁ బోలేదు.

సాయంకాలమునకుఁ గాలుబాధచే హైమవతి యస్థి
రమై శయ్యాశాయిని యయ్యెను. ఆరణ్యిక దొరకుటచేతఁ
గలిగిన సంతోషమువలన నామె కాపగలంతయు నెట్టిబాధయుఁ
దోఁచలేదు. కొంచెముసేపైనపిమ్మట నారణ్యికవచ్చి యామె
శయ్యాపార్శ్వమునఁ గూరుచుండెను. హైమవతికిఁ దొడపై
బలమైనగాయము తగిలెనని యారణ్యికకుఁ దెలియదు. ఆరణ్యి
కకు మనసున వ్యథకలిగెను. అది యామె మఱెవ్వరితోఁ జెప్పు
కొనును ? వ్యథవలన బాధనొందుచున్న హైమవతితోఁ జెప్పు

కొనుటకై వచ్చెను. వచ్చి కొంచెముసేపు కూరుచుండినపిమ్మట హైమవతిని సంబోధించి "అక్కా ! నాతండ్రిని జంపివేయుట కుఁ బట్టి తీసికొనివచ్చినారా ?" అని యడిగెను.

హైమ—అదియెట్లు తెలియునమ్మా !

ఆరణ్యైక మరల మెల్లమెల్లగ "దొంగలను పట్టుకొన్న చో నేమిచేయుదురు ?" అనియెను.

హైమవతి కొంచెము వెనుకముం దాలోచించి "శిక్షిం చెదరు." అని చెప్పెను.

ఆర—ఎట్టిశిక్ష చేయుదురు ?

హైమ—ఎంతటియపరాధమును జేసియున్నాకో అం తటిశిక్షను జేయుదురు లే తల్లీ !

ఆర—మనుష్యులను జంపువారి కెట్టి శిక్షనువిధింతురు?

హైమ—అట్టివారి నురితీయుదు రని వినియున్నాను.

అప్పు డారణ్యైక యేడ్చుచు "అట్లయినచో నాతండ్రి ప్రాణములు నిలుచుట యెట్లు ?" అనియెను.

ఆరణ్యైక యేడ్చుటను జూచి హైమవతికూడ మిగుల విచారించెను. ఆమె తనకాలినొప్పిని మఱచిపోయి నరహంత కుఁడును, బందెపోటుదొంగయునగు కిషణలాలుని ప్రాణము లను రక్షించుటకు వ్యాకులచిత్తయయ్యెను. ఆవెంటనే యొక పరిచారికమూలమునఁ దండ్రికి సమాచారము నంపెను. జగ చ్చంద్రుఁ డావెంటనే యక్కడకు వచ్చెను. హైమవతి యార

ణ్యేకను జేతితోఁజూపుచుఁ దండ్రినిజూచి "అప్పా! ఆరణ్యేక తండ్రికొఱకుఁ జాలనేడ్చుచున్నది. ఆతని బ్రదికించుట కేమైన నుపాయ మున్నదా ?" అని యడిగెను.

జగచ్చంద్రుఁడు కొమారితమాటలను విని మొదట నించుకచింతించి పిమ్మట "ఆతఁడు ఖూనీలుచేసినవాఁడు బందిపోటుదొంగ. అమ్మా! ఆతని రక్షించుటయెట్లు" అనియెను.

హైమ—అతఁడు ఖూనీ చేసినవాఁడే కానీ, బందిపోటు దొంగయేకానీ—ఆతఁడు మన యారణ్యేకకుఁ దండ్రి; ఈమె యాతనికొఱకు కేడువదా ?

జగ—నే నేమిచేయను తల్లీ! అపరాధియగువానికి శిక్షను విధించి తీరవలయును.

హైమ—శిక్షయనున దనేకవిధములుగా నున్నది. ప్రాణముండుటకై యేమైనఁజేయరాదా ?

జగ—అందుల కేదైన నుపాయమును జేయుదును. అందుకొఱకు నాచేతనైనంతవఱకుఁ బ్రయత్నించెదను. ఏమమ్మా! ఆరణ్యేకా! అట్లయినఁజాలునా?

ఆరణ్యేక యింతవఱ కస్థిరభావముతోఁ గూరుచుండి యేడ్చుచుండెను. వెంటనే యామె కన్నీటినిఁ దుడుచుకొని "అప్పా! ప్రాణములతో నుండునా ?" అనియెను.

జగచ్చంద్రుఁడు "మంచిది. ప్రాణదండనముమాత్రము కాకుండఁ బ్రయత్నించెదను'' అనియెను.

పిమ్మట హైమవతినిజూచి "హైమవతీ! సంధ్యాసమయమునఁ బరుంటి వేమి ?" అని యడిగెను.

హైమవతి యనుమానించుచు "నా కేమియును జబ్బు చేయలేదు. అప్పా! ఇందాకఁబడితినిగాదా ? అప్పుడు కొంచెము దెబ్బతగిలినది. ఆబాధ యుదయమునకుఁ బోవును" అనియెను.

జగచ్చంద్రుఁడు కొమరితమాటలను విని కొంచెము సేపు స్తంభితుఁడై యుండి పిమ్మట "లేవలేవా యేమి ?" అని యడిగెను.

హైమవతి లేవఁబోయెను. కాని లేవలేకపోయెను. "లేచుటకు వలనుగాకున్నది. బలమైనగాయము తగిలినది." అనియెను.

అప్పుడు జగచ్చంద్రుఁడు తనమనసున "బూడిదెయందును రత్నముదొరకును. నీవు హతభాగినివై యుండినను నీవే నాకన్యారత్నమవు." అని యనుకొనియెను.

---

## పదునేడవ ప్రకరణము.

---

రంగపురపుఁగారాగారముపై నధికారము జగచ్చంద్రునకుఁ జేరియుండెను. ఇంతకుఁబూర్వము వర్ణింపఁబడిన విశేషములు జరిగినకొన్ని దినముల కొకనాఁటి యుదయమున నాఁటి

గంటలకు జగచ్చంద్రుఁ డాకారాగారమునకుఁ బోయెను. కారాగారాధ్యక్షుఁడు వేగముగవచ్చి మర్యాదతో నంతయును జూజుటకై యాతని లోనికిఁబిలిచికొనిపోయెను. కిషనులాలున్న గదిలోనికిఁ దీసికొనిపోవలయునని జగచ్చంద్రుఁడు చెప్పఁగా నాయధికారి యక్కడకుఁ దీసికొనిపోయెను. అధికారియాజ్ఞానుసారముగా నక్కడనున్న భటుఁ డొకఁ డాకారాగారపుతలుపులు తెఱచెను. పిమ్మట జగచ్చంద్రునియాజ్ఞానుసారముగా నాకారాగారాధికారి యీవలికివచ్చి నిలిచెను. జగచ్చంద్రుఁడు కిషణలాలుని ముఖము నుద్దృష్టించి చూచెను. చూడఁగా నాతనికి విశేషాశ్చర్యము కలిగెను. కిషణలాలుని తేజఃప్రపూర్ణమైన యాగర్వితమూర్తి యెక్కడకోపోయెను. కొన్నిదినములలోపలనె యావీరమూర్తి కింతటిశోచనీయపరివర్తన మెట్లుకలిగినదో? కిషణలాలు తలవంచుకొని విషణ్ణమనస్కుఁడై కూరుచుండియుండెను. ఎదుట దండధరునివలె నిలిచియున్న జగచ్చంద్రు నాతఁడు కన్నెత్తిచూడలేదు. జగచ్చంద్రుఁ డించుక సేపూరకుండి పిమ్మట కిషణలాలుని సంబోధించి "కిషణలాల్! నీతనయకోరిక కనుగుణముగా విచారణమునకు ముందు నిన్నుఁజూచుట కిక్కడకువచ్చితిని. నీవు నామాట విన్నచో బ్రదుకుట కుపాయమున్నది." అనియెను.

కిష—ఇఁక నాతనయపేరు నాయెదుట నెత్తవలదు. మఱేమైనఁ జెప్పవలసియున్నచోఁ జెప్పవచ్చును.

జగ—నీవన్ని సంగతులను నిజముగాఁ జెప్పినచో నీకు నే నుపకారము చేయఁగలను.

కిప—నేనంతయును నిజముగాఁ జెప్పవలయునని సంకల్పించుకొని యున్నాను. కాని, యందులకుఁ బ్రతిగా మీవలన నెట్టియుపకారమును గోరఁబోను.

జగ—నీవన్ని సంగతులను సత్యముగాఁ జెప్పినచో నిన్ను సర్కారుపక్షముననుండు సాక్షిగాఁ జేసెదను.

కిప—నేను నాగుంపులోనివారినందఱిని విపత్తునముంచివైచి నాప్రాణమును గాపాడుకొనునంతటి నీచుఁడనుగాను. నేను వారందఱికంటెను హెచ్చుపాపినై యున్నాను. నాకు వారందఱికంటె నెక్కువశిక్షకావలయును.

జగ—నీమాటలువిని మిగులసంతుష్టుఁడనైతిని. కాని, యిఁకముందు నీవు ధర్మమార్గమందున్నచో నీపాపభార మించుక శమించును.

కిప—ఇఁక నాప్రాణములు నిలుపుకొనియుండుట నాకిష్టములేదు. నా కుపకారము చేయుట కిష్టమున్నచో నాకుఁ బ్రాణదండన మగునట్లు చేయవలయును.

జగ—ఆకస్మికముగా నీమనసెందుల కిట్లు పరివర్తనమైనది ?

కిష—నే నిదివఱకు బందిపోటులు మొదలగునవి నాపి ల్లకొఱకుఁ జేయుచుంటిని. ఎప్పు డామె నాదికాకపోయినదో యప్పుడు మఱెవ్వరికొఱకు బందిపోటులు మొదలగునవి చేయుదును ? నాయీపాపకృత్యములకొఱ కామెనన్నుఁ దిరస్కారము చేయుచున్నప్పుడు నే నిఁక నెవ్వరికొఱకీప్రాణముల నుంచుకొని యుండవలయును ?

జగ—నీ కింకెవ్వరును లేరా ?

కిష—లేరు.

జగ—అట్లయినచో నొకపిల్లపోషణముకొఱకు బందిపోటు మొదలైనవి గాక మఱేమియును లేకపోయెనవా ?

కిష—నేను రాజపుత్రుఁడను—వీరజాతికిఁ జేరినవాఁడను. ఎవ్వరియొద్దను సేవకవృత్తిచేయు ప్రవృత్తి నాకులేదు. బందిపోటులు వేయుట వీరపురుషవ్యవసాయమై యున్నది. అందువలన నీవ్యవసాయము చేయుచుంటిని.

జగ—బందెపోటులుసేయుట వీరపురుషవ్యవసాయము కాదు. బందెపోటుదొంగల నెవ్వరు నెప్పుడు వీరపురుషు లని చెప్పుట కిష్టపడఁబోరు.

కిషణులాలించుక నవ్వి "నావలెనున్న చిన్నచిన్నబందెపోటుగాండ్రను వీరపురుషులని చెప్పుట కిష్టపడరు. కాని వీరపురుషులని యెన్నఁబడుచున్న వారందఱును బందెపోటుగాండ్రే—కాని, దీని నెవ్వ రొప్పుకొందురు ? పరులరాజ్యమును

గొంటితీసికొనుట బందిపోటు (డెకాయిటీ) కాదా ?" అని యెను.

జగచ్చంద్రుఁడు కిషణలాలునిమాటను విని విస్మితుఁడై "నీబుద్ధిపరాక్రమములను జూచినచో నీవు బందిపోటుగాఁడవు గాక యొకవీరపురుషుఁడవనియే తోఁచుచున్నది." అనియెను.

కిషణలాలు మరలనవ్వి "నేను మొదట సర్కారుసైన్యమునఁ బని చేయుచుండెడివాఁడను. అక్కడనభివృద్ధికి మార్గమేమియు నగపడనందున నీపనివలన వచ్చురాఁబడి నంగీకరించితిని" అనియెను.

జగచ్చంద్రుఁ డించుకసేపు కిషణలాలునిముఖమును జూచి "నీకెందులకీదుర్బుద్ధికలిగినది? ఈపృథ్వియందు నీకొక్క కొమార్తె తక్క మఱెవ్వరును లేరు. నీవు మఱియొకమార్గమున ద్రవ్యమును సంపాదించినచో సుఖముగానుందువే!" అని యెను.

కిష—ఈపిల్ల నాగర్భవాసమునఁ బుట్టినది కాదు.

జగచ్చంద్రుఁ డాశ్చర్యముతో "అట్లయినచో నీ కెట్లు కూఁతురయినది ?" అని యడిగెను.

కిష—నాపెంపుడుబిడ్డ.

జగ—ఈమె నీ కెక్కడ దొరకినది ?

కిష—ఒకస్థలమున బందిపోటు వేయుచున్నప్పు డీబిడ్డను హరించి తెచ్చితిని.

ఈమాటను వినుటచే జగచ్చంద్రునిమనస్సునం దొక విధమైన వ్యాకులపాటు కలిగెను. ఆతఁడు వ్యగ్రభావముతో "ఎక్కడబందిపోటువేయుచున్నప్పుడు?" యని యడిగెను.

కిష—పబనాకుఁబోవుమార్గమున నొకనాఁటిరాత్రి యెవ్వఁడో యొకపెద్దమనుష్యుఁడు సపరివారముగా నెత్తయిన బండిమీఁదఁ బోవుచుండెను. బండిని చూచుటతోడనే మేము దానిపైఁబడి జనులను గొట్టితిమి. కాని, యాతనియొద్ద జోడు గుండ్లతుపాకి యొకటియుండెను. ఆతఁడు దానిని బ్రేల్చెను. ఆ శబ్దమునువిని మేము భయపడి పాఱిపోయితిమి. పాఱిపోవు సమయమునఁ జేతికేమియును దొరకలేదు. ఒకచిన్నపిల్ల యొంటరిగ నుండుటనుజూచి యాబిడ్డ నెత్తుకొని పాఱిపోయి దాఁగికొంటిమి. పిమ్మట విచారింపఁగా నాపెద్దమనుష్యుఁడు పబనాకుఁ గ్రొత్తగా డిప్యూటి మేజస్ట్రీటుపనిమై యిప్పుడే వచ్చుచున్నాఁడని తెలియవచ్చెను. అందువలన నానగలను పిల్లనుదాచిపెట్టుట యసాధ్యమని తలంచి, యాయడవియందుండక, యాస్థలమును విడిచి రంగపురారణ్యమునకు వచ్చి యక్కడ వాసము చేయుచుంటిని. అప్పుడాబిడ్డ కింకను నొకవత్సరమైన నిండియుండలేదు. ఆబిడ్డ నన్నే తండ్రిగా భావించుకొనుచున్నది.

జగచ్చంద్రుఁడు విభ్రమచేతస్కుఁనివలె నేమియు మాటాడఁజాలక కిషణలాలు చెప్పుచున్నమాటలను వినుచు నిష్పందనేత్రుఁడయి యాతనిముఖమునే చూచుచుండెను. కిషణలాలు

మాటలు పూర్తియైనపిమ్మట జగచ్చంద్రుఁ డున్మత్తునివలె లేచి నిలుచుండి యుచ్చస్వరముతో "కిషణలాల్ ! ఆపెద్ద మనుష్యుఁడను నేనే! నీయారణ్యైక నిశ్చయముగా నాతనయ యుషావతి !" అనియెను.

కిషణలాలు మొదట కొంతసేపటివఱకు విస్మితుఁడై యుండెను. విస్మయవేగము తగ్గినపిమ్మట "ఘటన మెన్నాళ్ళకు ముందుజరగినది చెప్పుఁడు?" అనియెను.

జగచ్చంద్రుఁ డానందబాష్పములను దుడిచికొనుచు "ఇప్పటికిఁ గొంచె మించుమించుగఁ బదుమూఁడు వత్సరములైనది." అనియెను.

కిష—మీపిల్లయొంట నేమేమి వస్తువులున్నవో జ్ఞప్తి యున్నదా ?

జగ—బిడ్డమెడలో బంగారపు పులిగోరును, నొకపగడములసరమును గలవు. చేతియందు సువర్ణవలయములున్నవి. మొలయందు బంగారపు గజ్జెలున్నవి. తలయందు బంగారు పూవున్నది. ఇంతమాత్రమున్నవి.

అప్పుడు కిషణలాలు గట్టిగా "అట్లయినచో నాబిడ్డ నిజముగా మీబిడ్డయే" అనియెను.

జగచ్చంద్రుఁ డానందముతో నర్తితుఁడై "నీవే నాబిడ్డ నెత్తుకొనిపోయితివి. నీవలననే యాబిడ్డ మరల నాకు దొరకినది.

ఆకారణమున నావలన నీకేమియుపకారము కావలయునో వేగ ముగఁ జెప్పుము. చేయుటకు సిద్ధముగానుంటిని. నే నేమిచేయ వలయునో వేగముగాఁ జెప్పుము. నేఁ నికఁ జాలసేపిక్కడనుండఁ జాలను. ఎందువలననగా—ఈశుభసమాచార మందఱకును జెప్పుట కాశపడుచున్నాఁడను" అనియెను.

కిష—మీావలన నాకెట్టి యుపకారము నక్కఱ లేదని మొదట నే చెప్పియుంటిని.

జగ—నీ యీామాటలవలన నాకుఁ జాలఁ జింతగా నున్నది.

కిష—నేను నిజముతప్ప నసత్యమును జెప్పుటలేదని ప్రతిజ్ఞ చేసికొనియున్నప్పుడు మీారు నన్నెట్లు బ్రదికింపఁగలరు? మఱియు నాయట్టిపాపికి దండనముగుటయే యుచితము. మీారు నాకుపకారము చేయుదునని చెప్పినచో మీాకర్తవ్యకార్యము నకు హానికలుగును.

జగచ్చంద్రుఁడు యోచించి "నే నింతవఱకనేకులగు బందిపోటుగలను దొంగజూచియుంటిని. కాని, నీవంటివాని నెప్పుడును జూచియుండలేను. నీయదృష్టమెట్లున్నదో యట్లగును. నే నిఁక నాలసింపఁజాలను." అనియెను.

ఇట్లు చెప్పి జగచ్చంద్రుఁ డక్కడనుండి వెడలిపోయెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

మఱునాఁ డారణ్యకను బ్రభావతి మొదట చూచిన ప్పుడు ప్రభావతి యామెతో నెట్టిమాటయు నాడక ముఖమును ద్రిప్పుకొని వెడలిపోయెను. ప్రభావతి యిట్లు వెడలిపోవుటను జూచి యారణ్యక పరుగెత్తుకొనిపోయి యామెను బట్టుకొని "ప్రభా! నిన్నటనుండి నీవు నాకగపడుట లేదేమి? అదియును గాక; నన్నుఁ జూచుటతోడనే పాఱిపోవుచుంటివేమి? నాతో మాటాడుము—నీమాటలను వినుటకు నాకెంతో ముచ్చటగా నున్నది." అనియెను.

ప్రభావతి మిగుల నప్రతిభయయ్యెను. ఆమె యారణ్యకవిషయమున విశేషాపరాధము చేసియుండెను. ఆరణ్యకప్రవర్తనమువలన నామె తన యపరాధమును మనస్సునం దుంచుకొనలేదని తెల్లమయ్యెను. ఆకారణమునఁ బ్రభావతి కొంచె మాశ్చర్యముతో నారణ్యకనుజూచి "ఇప్పు డొకపనియున్నది. పోవుచున్నాను. తరువాత వచ్చి మాటలాడెదను." అని చెప్పెను.

ఇట్టి ప్రత్యుత్తరమును వినుటచే నారణ్యకకు వ్యథకలిగెను. పిమ్మట నామె యొకనిట్టూర్పువిడిచి "నీతో నొక గొప్ప సంగతిఁ జెప్పవలసియున్నది. ఇక్కడనే కూర్చుండుము." అనియెను.

పిమ్మటఁ బ్రభావతి మెల్లమెల్లగ నక్కడనే కూర్చుం డెను. కూర్చుండి యతిక్షీణమగు మృదుస్వరముతో "ఏమిసం గతి ?" అనియెను.

ఆర—నీవు నాకుఁ జెల్లెల వగుదువు. చెల్లిలితో నెట్లుం డవలయునో నాకుఁ దెలియదు. ఇప్పుడు మీయింటికి వచ్చితిని. కావున నాకుఁ దెలియఁజెప్పుము.

ప్రభా—నీకేమి చెప్పవలయును ? ఇప్పుడు ప్రస్తావము వచ్చుటచేత నొకమాట చెప్పుచున్నాను. నీవు నాసర్వనాశనము చేయవలదు. నాస్వామిని నానుండి లాగికొనిపోవలదు.

ఆరణ్యికహృదయము దడదడఁ గొట్టుకొన నారంభించె ను. ఆమెమనసునం దేమియో చెప్పరానియాతన ననుభవిం చుచు వడఁకసాగెను. పిమ్మట నామె "నేను ప్రతిజ్ఞచేసి చెప్పు చున్నాను—నీవు నిశ్చింతగా నుండుము. నేను నీస్వామిని దీసి కొనిబోను." అనియెను.

ప్రభా—నీవు నాస్వామినిఁ బ్రేమించుటలేదని కూడఁ జెప్పవలయును.

ఆరణ్యిక యాశ్చర్యపడి "అదియెట్లు ? ప్రేమించుట దోషమా ?" అని యడిగెను.

ప్రభా—సంపూర్ణముగా దోషము. నేను ప్రాణముల తోనుండఁగా నదిచూచి సహింపఁజాలను. నేను నీస్వామినిఁ బ్రేమించినచో నీవు సహింపఁగలవా ?

ఆర—సహింపకేమి ? ఎవ్వరందముగా నుందురో వారి నందఱును బ్రేమించుచునే యుందురు.

ప్రభా—నాస్వామి యందగాఁడే కానిమ్ము—కాకపో నిమ్ము. ఎట్లున్న నాతఁడు నావాఁడు. ఆతనిఁ బ్రేమించుటకు నీ వెవ్వరు? అయిన దైపోయినది. ఇఁక నీవు నాస్వామినిఁ బ్రేమింపనని చెప్పుము.

ఆర—ఈమాట నాప్రాణములున్నంతవఱకుఁ జెప్పఁజాలను.

"అట్లయినచో నీవు చచ్చుటయేమేలు" అని చెప్పి ప్రభావతి యక్కడనుండి లేచి వేగముగ వెడలిపోయెను. ఆరణ్యైక యించుకసే పేమియుం దోఁచక యక్కడనేయుండి పిమ్మట మెల్లమెల్లగ లేచిపోయి హైమవతిప్రక్కయొద్దకు వచ్చి కూర్చుండెను. హైమవతి కింకను లేచుటకు శక్తిరాలేదు.

ఆరణ్యైక హైమవతియొద్ద నించుకసేపూరక కూర్చుండి పిమ్మట "అక్కా! ఎవఁడు మిగుల నందముగానుండునో వానిని మనసున ప్రేమించుట పాపమా ?" అని యడిగెను.

హైమవతి మొదట నారణ్యైకను తదేకదృష్టితోఁ జూచుచుండెను. పిమ్మట నామె "నేను మొదటనే చెప్పియున్నానుగాదా—బాగుగ నుండనిమ్ము. అందముగా నుండనిమ్ము—ఆఁడుది తనస్వామినిదక్కఁ బరపురుషుని ప్రేమించుట పాపమని చెప్పలేదా ?" అనియెను.

ఆర—ఎందులకుఁ గూడదో నాకుఁ దెలియఁజెప్పుము.

హైమ—పరులస్వత్వమును దొంగిలించినచోఁ బాప మని తెలియునా ?

ఆర—తెలియును.

హైమ—నీవెవ్వరినిఁ బ్రేమించుచున్నావో యాతఁడు, అందులకు బదులుగా నిన్నుఁ బ్రేమింపవలయునని నీకిష్టముండు నా లేదా ?

ఆర—ఇష్టముండును.

హైమ—కాని, ఆప్రేమ కాతనిపత్నియే సంపూర్ణాధి కారిణియై యున్నది. నీ వట్టియామెప్రేమను దొంగిలించుటకుఁ బోవుచుంటివి. ఇట్టిదొంగతనము పాప మగుచున్నది. ఇప్పుడు తెలిసినదా ?

ఆర—నాప్రేమకుఁ బ్రతిగా నాతఁడు ప్రేమింపవలయు నని యాసపడనప్పుడో ?

హైమ—అట్లాశపడకుండ నుండుట కెవ్వరికైన శక్య మగునా ? నీ వాశపడకుండ నుండఁగలవా ?

ఆర—ఉండఁజాలను.

హైమ—అట్లయినచోఁ జెడ్డమార్గమున కెందులకు బోయెదవు ?

ఆరణ్యైక ప్రత్యుత్తరము చెప్పవలయునని యుండెను. కాని, యాసమయమున జగచ్చంద్రుఁ డాగదిలోని కానందోన్మత్తుఁడై పరువెత్తుకొనివచ్చి చీత్కారముసేయుచు "ఆరణ్యైక యెక్కడ ? ఓతల్లీ హైమా ! ఆరణ్యైక మనబిడ్డయే—ఆరణ్యైక దొంగలచే హరింపఁబడిన యుషావతియే !" అని కేకవైచి చెప్పెను.

హైమవతి తత్క్షణమే గర్భాలున శయ్యనుండి లేచి నిలిచెను. ఈయాశాతీతసుభసమాచారముచే నామె తనకాలుబాధయే మఱచిపోయెను. హైమవతి పిచ్చిదానివలెఁ బోయి యారణ్యైకను స్నేహభావముతో నాలింగనముచేసుకొని "నా యుషా—నీవే నాయుషవు?" అని చెప్పుచుండఁగా నామెకంఠస్వరము రుద్ధమైపోయెను; కన్నులనుండి యనర్గళముగా నానందబాష్పధారలు ప్రవహింపనారంభించెను. యీసమయమున జగచ్చంద్రుని వక్షస్స్థలము మవిశ్రాంతాబిందువులచేఁ దడిసిపోయెను.

ఆరణ్యైక యిందలియర్థమేమియును దెలియక యాశ్చర్యపడుచు నొకసారి హైమవతిముఖమును మఱియొకసారి జగచ్చంద్రునిముఖమును జూడనారంభించెను.

ఆనందవేగ మించుక తగ్గినపిమ్మట జగచ్చంద్రుఁడు కిషణలాలునివలన వినినదంతయు నామూలాగ్రముగఁ దెలియఁ

జగ—అన్నా! ప్రకాశా! ఏమని నీ కాశీర్వాదము చేయవలయునో వెదకినను మాటదొరకుటలేదు. ఆహా! మీ యత్త బ్రదికియున్నచో నామెయెంత యానందపడునో గదా! ఆమె యుషావతి శోకమువలననే స్వర్గస్థురాలైనది.

తుదిమాటలను జెప్పుచు నా బ్రాహ్మణుఁడేడ్చుటకారంభించెను. సిమ్మట నాతఁడు కన్నీరుతుడుచుకొని "అన్నా! ఈశ్వరుఁ డంతయును మంచియే చేయును. ఏఘటనవలన నేమైనదియో యోచించి చూడుము!" అనియెను.

ప్రకా—ఇది మిగుల నాశ్చర్యమైనఘటన! నిజముగా నిది సర్వమంగళుం డగు నాపరమేశ్వరునియందలి ఘటనాకౌశలమే.

హైమ—మనబంధుమిత్రు లెక్కడెక్కడ నున్నారో యక్కడ కీశుభసమాచారమును బంపవలయును.

జగ—వట్టిసమాచార మెందులకమ్మా! నే నందఱ నిక్కడకే పిలిపించెదను.

హైమ—ఉషావతిపెండ్లినాఁడు—నేడు మనయుషావతికి మిగులసంభ్రమముతోఁ బరిణయము కావించెదను.

హైమవతి యీమాటను వినుటచేఁ బ్రకాశచంద్రుని హృదయము దడదడఁగొట్టుకొన నారంభించెను. ఆసమయమునఁ బ్రకాశచంద్రుఁ డొకసారి యారణ్యకమొగము

వంకఁజూచెను. చూడఁగా నామె మొగమునందలి యానిర్వ్యాజ భావ మంతగా నగపడలేదు. ఇంచుకసిగ్గుతో వ్రాల్పఁబడి యామెముఖము తళతళప్రకాశించుచుండెను. కాని యానందజనకమగు సోదరిప్రస్తావముచేఁ నామెనగు మొగ మాకస్మికముగ నిరానందచిహ్నముల కాకరమయ్యెను. నిదాఘప్రచండమార్తాండకిరణములవలనఁ బ్రస్ఫుటితమైన యొకకమల మాకస్మికముగా ముడుచుకొని పోయినట్లయ్యెను. శుష్కమైయున్నను ప్రకాశచంద్రుఁడు చూచునరి కాముఖకమల మత్యంత సుందరముగా నుండెను.

ఆరణ్యిక యట్టిభావమునుజూచి ప్రకాశచంద్రుఁడు మరల నామెవైపునకుఁ జూడలేదు. ఆమెవైపునకుఁ జూచుట కాతనికి సిగ్గుకలిగెను. ఆకస్మికముగా వర్షాకాలమున నదీపుష్కరిణు లెట్లు కూలంకషజలంబులచేఁ బరిపూర్ణంబులగునో యట్లే యానసమయమునఁ బ్రకాశచంద్రునిహృదయమును నానందోచ్ఛ్వాసముచేఁ బరిపూర్ణమయ్యెను. ఆయానందోచ్ఛ్వాస మించుక ప్రశమితమైనపిమ్మట నాతఁడు తనమామను జూచి "ఆరణ్యిక కిషణలాలుకూఁతురుగాదని నే నామెను జూచినప్పుడే తెలిసికొంటిని. కాని, యామె దొంగలెత్తుకొనిపోయిన మీబిడ్డయగునుపావతియని స్వప్నమునందైనను దలంపలేదు. ఏమైనఁగానిండు. ఆరణ్యికను మొదట మీయొద్దకుఁ దీసికొనివచ్చినప్పుడు నామనసునకుఁగలిగినసంక్షోభ మిప్పుడు దూరమైపోయినది." అనియెను.

జగ—అన్నా ! అంతయును బాగుగనే జరగినది. కాని నామనసునం దింకను నొకవిచారము తప్పినదికాదు. ఇప్పుడు మీయత్త బ్రదికియున్నచో—

ఈమాటలు చెప్పుచుఁ జెప్పుచునుండఁగా బ్రాహ్మణుని కన్నులనుండి రెండశ్రుబిందువులు జాఱిపడియెను. ఆతఁడు కన్నులఁ దుడిచికొని యారణ్యకంజూచుచు స్నేహప్రపూర్ణవాక్యములతో "తల్లీ! ఇఁకమీఁద నిన్నెవ్వరును నారణ్యకయని పిలువఁబోరు. నేఁడుమొదలు నిన్నందఱు నుషావతియని పిలిచెదరు. నీవు నాయింటిమహాలక్ష్మివై వచ్చితివి. నేనీదినమున నొక యమూల్యరత్నమును సంపాదించుకొంటిని" అనియెను.

పిమ్మట హైమవతినిఁ జూచి "అమ్మా! హైమా! నీ వుషావతి నత్యంతమును బ్రేమించుచ నే యుంటివి. నేను విశేషముగఁ జెప్పఁబోను. నీవు మనప్రభావతి నెట్లు పెంచి పెద్దదానిని జేసితివో యట్లే యుషావతినిగూడఁ బెంచి పెద్దదానిని జేయుము. ఆమెను నీచేతఁబెట్టి నేను నిశ్చింతగా నుండెదను." అనియెను.

హైమ—అన్నా ! ఉష యింకను సరళబాలిక. ఆమెకు సంసార మేమియును దెలియదు. నే నామె కంతయును బోధించెదను. నీవు మంచివరుని వెదకి విశేషసంభ్రమముతో నీమెకు వివాహము చేయవలయును.

ఆసమయమున నొకభృత్యుఁడు వచ్చి "వెలుపలభట్టాచార్యులును నింకను నితరులగుపెద్దమనుష్యులును మిమ్మును జూచుటకు వచ్చియున్నారు" అనిచెప్పెను.

జగచ్చంద్రుఁడు హరినాథభట్టాచార్యుని గురువువలె సన్మానించుచుండెను. భట్టాచార్యులు వచ్చిరని విన్నతోడనె జగచ్చంద్రుఁడు వెలుపలికి వచ్చెను. ఆతఁడు వెలుపలికి వచ్చి యీశుభసమాచార మందఱకును దెలియజేసెను. అందఱును విని యానందించిరి. వారిలో నొకఁడు "మీబిడ్డ యిన్నాళ్ళు నొక దొంగయింటియందున్నది. అట్టియామెను మీయింటి యం దెట్లుంచుకొందురు?" అని యడిగెను.

ఈమాటలు వినుటచే జగచ్చంద్రుని యానందప్రవాహ మాకస్మికముగా నడ్డగింపఁబడియెను. ఆతఁడు భట్టాచార్యుని ముఖముఁజూచెను. భట్టాచార్యునివంటి శాస్త్రపండితు లా చుట్టుపట్ల నెవ్వరును లేరు. సకలశాస్త్రములయందు నాతని కసాధారణపాండిత్య మున్నదని యందఱును హేరాళముగాఁ జెప్పుదురు. భట్టాచార్యుఁ డించుక యోచించి "ఇట్టిసందర్భమున శాస్త్రమునందుఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడియున్నది. మీకామార్తెచేఁ బ్రాయశ్చిత్తమును జేయింపవలయును" అని చెప్పెను.

అప్పుడు జగచ్చంద్రుఁ డానందముతో నుబ్బి "మీ రెట్టి ప్రాయశ్చిత్తమును జేయవలయు నని సెలవిచ్చెదరో యట్టిదా నిని చేయుటకు సిద్ధముగా నుంటిని." అనియెను.

ఈమాటలు జరిగినపిమ్మట బాలిక నింటఁబెట్టుకొనుట కెవ్వరిమనసునందును నెట్టిసందేహమును లేకుండఁబోయెను. అప్పుడందఱును సమయోచితములగు మాటలతో జగచ్చంద్రునియానందమును వృద్ధిపఱచిరి. చూచుచుండఁగనే యానాఁడు జగచ్చంద్రునిగృహ మానందోత్సవములతో నిండి పోయెను. కాని, యీయానందోత్సవములనడుమఁగూడ నాతఁడు పండ్రెండువత్సరములకు ముందుగలిగినశోకమును మఱవలేదు. నడుమనడుమ "నేఁ డామె యున్నచో—" అని చెప్పుచుండెను.

---

## ఇరువదియవ ప్రకరణము.

కిషణలాలు మొదలగుదొంగలపైఁ గలఫిర్యాదు సెషన్ కోర్టునందు విచారణ జరిగి వారందఱకును యావజ్జీవమును ద్వీపాంతరవాసమునం దుండవలయునని శిక్షయయ్యెను. అది విని రంగపురసీమవారందఱు నానందమును బొందిరి. కాని యారణ్యైకి (ఇప్పుడుషావతి) యొక్కతెమాత్ర మాసమాచారమును విని దుఃఖితయయ్యెను.

భట్టాచార్యుఁ డొనరించిన వ్యవస్థానుసారముగా నుషావతికిఁ బ్రాయశ్చిత్తమయ్యెను. పిమ్మట జగచ్చంద్రుఁ డుషా

నతిపరిణయమును గూర్చి యోచింపసాగెను. ఆతఁడనేకప్రయత్నములను జేసి వరాన్వేషణ మనేకస్థలములఁ జేసెనుగాని తగినవరుఁడు దొరకలేదు. ఉష గొప్పవారింటి యాఁడుబిడ్డ. అదియునుగాక చూచుటకు మిగులసుందరి. అయినను నిన్నివత్సరములవఱకును దొంగలయింటఁ బెంపఁబడి యుండుటచేత గొప్పయింటివా రెవ్వ రామెను దీసికొనుట కంగీకరింపలేదు. జగచ్చంద్రునకుఁ జాలకొఱఁతగానుండెను.

ఒకనాఁటిసాయంకాలమున జగచ్చంద్రుఁడును హైమవతియు నీవివాహవిషయమున మాటలాడిరి—

హైమ—అప్పా! ఉషవివాహవిషయమున నేసంబంధము నిశ్చయింపఁబడినది ?

జగ—తల్లీ! ఇంకను నెట్టిసంబంధమును గుదురలేదు. నాకు నచ్చినవరుని తల్లిదండ్రు లీపెండ్లిసూఁతు నంగీకరించుట లేదు. నాకు నచ్చనివా రనేకులున్నారు. కాని యావరుల కిచ్చుటకు నాకిష్టములేదు. ఇంకను నెట్టిసంబంధమును నిశ్చయింపలేకుండ నున్నాఁడను.

హైమ—అప్పా! నీవిష్టపడినచో నేనొకటి యోచించి యున్నాను.

జగచ్చంద్రుఁ డాత్రముతో "ఏమి యోచించితివి ?" అనియెను.

హైమవతి తండ్రిప్రశ్నమును విని ప్రత్యుత్తరము నిచ్చుట కించుక వెనుకముందు చూచెను. పిమ్మట నామె రెండుచేతుల వ్రేళ్లను, వ్రేళ్లనడుమ వ్రేళ్లనుంచి ముంజేతులు మీఁదగునట్లుగాఁ జేతులను గ్రిందికిఁజాచి మృదువుగ నదిమిపట్టి చిటపట నెటికలనువిఱిచి, ముఖమును మీఁదికెత్తి "మనప్రకాశచంద్రున కుమావతినిచ్చి పెండ్లిచేయఁగూడదా ?" అనియెను.

ఈప్రస్తావమును విని జగచ్చంద్రుఁడు మొదట నించుక యోచించెను. పిమ్మట నారక్తమై వంగియున్న హైమవతి ముఖమును దృష్టించి చూచుచు యోచింప నారంభించెను. కొంచెము సేపు యోచించినపిమ్మట "ప్రకాశచంద్రుఁ డిందుల కొప్పుకొనునా?" అనియెను.

హైమవతి తలవంచుకొనియుండియే "అప్పా! ఆభారము నామీఁద నుంచుము." అనియెను.

జగ—మనప్రభావతిమనసునకుఁ గష్టముగా నుండకుండఁగూడఁ జూచికొనవలయును.

హైమ—ప్రభావతి యిందుల కొప్పుకొనునట్లు నేను చేసెదను.

జగచ్చంద్రుఁడు మరల నించుకయోచించి "ప్రకాశచంద్రుఁడు కులీనుఁడు. నే నతని కిం కొకపిల్లనుగూడఁ గన్యాదానము చేసినచో దోష మేమియు నుండదు. సరియైనవరుఁడు దొరకకపోవుటచే నా కిదియే సమ్మతముగా నున్నది. అదియు

నుగాక నీవే యీప్రస్తావమును దెచ్చితివి గావున నింక నా యాక్షేపణ మేమియును లేదు. నీ వీప్రస్తావమును జేయుటకుఁ దగినకారణమును గూడ నేనెఱుఁగుదును తల్లీ! నీ వాప్రయత్నముఁనే చేయుము” అనియెను.

హైమవతి తండ్రియొద్దనుండి వేగముగఁబోయి ప్రభావతికిఁ దలదువ్వుటకై కూర్చుండెను. ప్రభావతికిఁ దలదువ్వించుకొనుట కిష్టము లేకపోయినను హైమవతి యామెనుబలవంతముగాఁ గూర్చుండబెట్టెను. హైమవతి యత్యంతాదరముతోఁ జెల్లెలికిఁ దలదువ్వుటకై కూరుచుండెను. తలదువ్వుచున్నప్పుడు మాటపై మాటవచ్చి తుద కుషావతిపెండ్లిమాటలు గూడ వచ్చెను. హైమవతి “అప్ప యింకను నుషావతిపెండ్లివిషయమున నేమియు నిశ్చయింపలేదు.” అనియెను.

ప్రభావతి మెల్లమెల్లగ “అదేమి?” అనియెను.

హైమ—తగినవరుఁడు దొరకలేదు.

ప్రభా—అట్లయినచో, అప్పను, హెచ్చుధనమునుఁ గర్చుపెట్టుట కిష్టములేనట్లు తోఁచుచున్నది.

హైమ—అంతేకాదు. ప్రభా! ఇంతపెద్దపిల్లను గొప్పయింటివారు చేసికొనుట కంగీకరింపరు.

ప్రభా—అట్లయినచో నిఁక నుపాయ మేమున్నది?

హైమ—నీకిష్టపడినచో నిరువుల కుపాయమున్నది.

ఆకస్మికముగా మార్గమధ్యమునఁ గాలసర్పమును గాంచి నచోఁ బథికుఁ డెట్లుభయముచే వడఁకునో యట్లే ప్రభావతియు వడఁకి ముందడుకిఁ గ్రుంగెను. ఆవెంటనే యామె తనముఖమును వెనుకకుఁ ద్రిప్పుకొని యక్కముఖమును వెఱ్ఱిచూపులతోఁ జూడసాగెను. హైమవతి కొయ్యవడిపోయెను. ఆమెనోటినుండి మాటయే రాలేదు. ప్రభావతి "నేనిష్టపడినచో నేమి యుపాయమున్నది? అక్కా" అనియెను.

హైమవతిముఖము వాఁడిపోయెను. ఆమెహృదయము దడదడ కొట్టుకొన నారంభించెను. డగ్గుత్తికవడి యామెకంఠము నుండి ప్రత్యుత్తరము రాలేదు. ప్రభావతి మరల "అక్కా! ఏమియుపాయ మున్నది?" అని యడిగెను.

హైమవతి రెండుమూఁడుసారులు గొంతుదు సవరించుకొని మిగులఁ గష్టముతో "లేదు. ప్రభా! ఆమాటవలనఁ బ్రయోజనము లేదు. ఉషావతి కిట్టే ముసలితనము రానిమ్ము" అనియెను.

ప్రభావతి ముఖమును ద్రిప్పుకొని యవనతమస్తకయై మెల్లమెల్లగ "అక్కా! నీవు చెప్పకున్నను నీమనస్సులోని యభిప్రాయము తెలియవచ్చినది. చిన్నక్కను నాకు సవతిగాఁ జేయవలయునని యిష్టపడుచుంటివి. ఔనా?" అనియెను.

హైమ—ప్రభా! ఒకతల్లికడుపునఁ బుట్టినవారు సవతులగుట యెట్లు?

ప్రభా—అక్క సెల్లెండ్రొక్కనినే పెండ్లియాడినచో సవతులు కాకుందురా ?

హైమ—అక్క, యక్కగానే యుండెను. అక్క యెప్పటికిని సవతి కాదు.

ప్రభా—అప్ప యిష్టపడినాఁడా ?

హైమ—ఇష్టపడును.

ప్రభా—చిన్నక్కయో ?

హైమ—ఆమెయు నిష్టపడును.

ప్రభా—ఇఁక—

ప్రభావతి ముందేమో చెప్పఁబోయెను. కాని యా మాట నోటినుండి వెలువడలేదు. ఆమె కొంచెము సేపూరకుండి "అక్కా! నాకిష్టమే" అనియెను.

హైమవతి చెల్లెలిముఖమును ముద్దుపెట్టుకొని "వలదు ప్రభా! నేను తలంచినదితప్పు. నీవిష్టపడినను నే నిష్టపడఁబోను. ఉషను మఱియొకవరునకిచ్చి పెండ్లిచేయుదును." అనియెను.

అప్పుడు ప్రభావతి, అక్కకాళ్ళపైఁబడి "వలదు. అక్కా! నీవిష్టపడకుండవలదు. నేను నీకాళ్లుపట్టుకొని నిజము చెప్పుచున్నాను. నా కిదిసంపూర్ణముగా నిష్టమున్నది." అనియెను.

హైమవతి మరలఁ జెల్లెలిముఖమును ముద్దుపెట్టుకొని "నీవు నీమనఃపూర్వకముగా సత్యమునే చెప్పుచున్నావా ?" అనియెను.

ప్రభ యాయుత్తరక్షణముననందే, "అక్కా! ఔను. నేను సత్యమునే చెప్పుచున్నాను" అనియెను.

ప్రభావతికిఁ దలదువ్వుట యింకను ముగియలేదు. అయినను హైమవతి వెంటనే తలదువ్వుటను వదలి లేచి నిలచెను. మరల నామె యేమియో యోచించుకొని కూర్చుండి వేగముగఁ దలదువ్వుటను పూర్తిచేసి యక్కడనుండి లేచి వెడలిపోయెను. ప్రభావతి యక్కడనే చాలసేపు చుబుకముపై వ్రేలుంచి కూర్చుండి యుండెను. ఆమెకన్నులనుండి వెలిమబ్బుగల గాలివానమధ్యమునందలి పెద్దపెద్ద వానచినుకులవలెనే కొన్ని యశ్రుబిందువులు రాలెను.

పిమ్మట శ్రావణమాసవర్షధారవలెఁ గురిసి నేలయంతయును దడసిపోయెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

ఆరణ్యైక కిమణలాలుని తనయకాదనియు, నామె తన మేనమామకూఁతు రనియుఁ బ్రకాశచంద్రుఁ డేదినమునఁ దెలిసికొనియుండెనో యప్పటినుండియు నాతనిహృదయ మించించుక మార్పునొందుచుండెను. ఈసమాచారమువలన నాతనికిఁ

గలిగిన యానందమునం దాతఁడు ప్రభావతితప్పుల నన్నిటిని మఱచిపోయెను. ప్రభావతి యారణ్యైకను మోసగించి యా దారుణరాత్రిసమయమున పీరగంజి ముందలి పుష్కరణికిఁ దామరపువ్వులకొఱకుఁ బంపకపోయినయెడల నింతత్వరగా నారణ్యైకసమాచారము బయలుపడకయే యుండును. ఇప్పు డా యారణ్యైక తనభార్యకు సోదరియై యుండుటవలన నాత్మీయ యయ్యెను. ఆసంగతి జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల నాతనిహృదయ మానందమున నృత్యము చేయుచుండెను. దొంగవానితనయ యని మొదట నారణ్యైకయం దేట్టిభావముండెడిదో యిప్పుడా భావము లేదు. అందందు నిలువఁబడి యారణ్యైకను జూడవలయు నని యాతఁ డాశపడుచుండెను. అందువలన నాతఁ డేదియో నెపముపెట్టుకొని లోపలికి వచ్చి యామెను జూచి పోవలసి యుండెను. ఇప్పు డారణ్యైక యాతనిహృదయరాజ్యమున సర్వాధికారిణియై యుండెను. ఆరణ్యైకను జూడకున్నచో నాతనికి నలుదెస లంధకారబంధురము లైయుండెను. ఆతఁ డెల్లప్పుడును పరధ్యానముగా నుండును; ఎవ్వరితోడను సరిగా మాటలాడుట లేదు; ఒకచోట నింపుకసేపు స్థిరముగాఁ గూరుచుండుటయే కష్టముగానుండెను; నిరంతరము నస్థిరుఁడై తిరుగాడుచుండును. రాత్రి యాతనికినిద్రవట్టుట లేదు. కొంచెము పరాకు గాఁగన్నులు

మూఁతలుపడినతోడనే యారణ్యికస్వప్నమునఁ దోఁచి వెంటనే యాకలఁతనిద్రకూడ భంగమగుచుండును.

నేఁడు ప్రకాశచంద్రుఁడు విషణ్ణుఁడై యుండెను. ప్రబల మారుతసంచాలనంబున నదీవక్షమునం దనేకతరంగమాలికలు లేచునట్లే యాతనిహృదయమునం దొకదానివెనుక నొక్కటిగ ననేకవిచారము లుదయము లగుచుండెను. నడుమనడుమ నిరాశయను భీషణతరంగ ముప్పొంగ నారంభించెను. ఆభీషణతరంగముపై నాశలను చిన్నచిన్నతరంగములు తేలిపోవుచుండెను. ఈసమయమునందు హైమవతి వచ్చి యాతనియెదుట నిలువం బడియెను. ప్రకాశచంద్రుఁడు గాఢవిచారమున మునిఁగియుండు టవలన నామెపై నాతనిదృష్టి ప్రసరింపలేదు. హైమవతి యాసంగతిని గ్రహించి "ప్రకాశా!" అని పిలిచెను.

ప్రకాశచంద్రుఁడు చకితుఁడై చూచెను. హైమవతి యెదుట నిలిచి యుండెను. అప్పు డప్రతిభుఁడై వేవేగముగఁ దెలివితెచ్చుకొని "ఏమి" అనియెను.

హైమవతి కొంతసేపటివఱకు నాతని విచారక్లిన్నవదనముం గాంచి పిమ్మట "ప్రకాశా! నీవు నిన్నను నేఁడునుగూడ నింతపరాకుగ నుంటివేమి? నీమనోవికారము నాకుఁ దెలుపఁగూడదా?" అనియెను.

ఆప్రశ్నము వినినతోడనే ప్రకాశచంద్రుఁడు శుష్కకంఠుఁడై గురుతరకార్యముఁజేసిన యపరాధివలె నగుటచే నాతని గుండెలు కొట్టుకొనసాగెను; అందువలన వెంటనే యాప్రశ్నమునకుత్తర మీయఁజాలకపోయెను. హైమవతి మరల "ప్రకాశా! నేను నిన్ను నాతమ్మునివలె భావించుచుంటిని. నాయొద్ద నేమాటయును దాఁపవలదు" అనియెను.

ప్రకాశచంద్రుఁ డతికష్టముతో "నీయొద్ద నేనేమి దాఁపఁగలుగుదును? నామనస్సు నావశముదందులేదు. అందువలనఁ బాతాళమునకుఁ బడిపోవుచుంటిని. నే నెంతయో ప్రయత్నించుచుంటిని. అయినను మనసు వశపడుట లేదు. నాస్వభావమున భయంకరపరివర్తన మగుచున్నది. ఇప్పుడు నేను నీమొదటిప్రకాశచంద్రుఁడను గాను. ఇప్పుడు నేను భయంకరనరాధముఁడనై యుంటిని. మీయెల్లరితిరస్కారమునకుఁ బాత్రుఁడనై యుంటిని" అనియెను.

హైమవతి చూచుచుండఁగనే ప్రకాశునికన్నులనుండి యశ్రువులు జాఱి యాతనిగండస్థలమునం బడియెను. వానిని జూచి హైమవతి యస్థిరహృదయయై "ప్రకాశా! నీవెందులకింతతల్లడపడియెదవు? నీవు నోటితోఁ జెప్పకపోయినను నేనింతకుఁ జాలదినములక్రిందటనే నీమనోభావమును గ్రహింపఁ గలిగితిని. అందులకుపాయమునుగూడఁ జేసితిని. ఆసంగతి తెలుఁ

పుటకే యిప్పుడు నీయొద్దకు వచ్చితిని. ఉషావతిని నీకిచ్చి మరల వివాహము చేయదలఁచితిమి. ఇట్లు చేయవలయునని చెప్పినతోడనే నాజనకుఁ డంగీకరించినాఁడు. ప్రభావతియు నంగీకరించినది. నీవు మాతిరస్కారపాత్రుఁడవు కావు; స్నేహపాత్రుఁడవే. అందువలననే యొకదానిపై మఱియొకసంబంధము కల్పించి కట్టవలయు నని తలంచితిమి” అనియెను.

“ఏమికావలయునో కోరికొనుము” అనిపలుకుచు నొకదేవమూర్తి యెదుట నిలువఁబడియున్నచో నెంత యాశ్చర్యముగా నుండునో, హైమవతి చెప్పినమాటలవలనఁ బ్రకాశునకంతకంటె నధికాశ్చర్యము కలిగెను.ఆనందగిరి నిర్ఝరిణియొక్క ప్రబలప్రవాహ మాతనిహృదయకందరమును నిండించి పొంగి పొరలుచుండెను. అందువలన నాతఁడు నోటితో నేమియు మాటాడఁజాలకపోయెను. అయినను హైమవతి నిలువుటద్దమునఁ జూచినట్లుగనే యాతనిమనోభావముల నన్నిటిని గ్రహించెను. ఇఁక నచ్చట నుండుట సరికాదని యెంచి హైమవతి మెల్లమెల్లగ నటనుండి జరిగిపోవుచుండెను. పోవునప్పు “డీనెలలోనున్న వివాహలగ్నములలోఁ బ్రథమముహూర్తమునందే నీకును నుషావతికిని బరిణయముకాఁగలదు” అనిచెప్పిపోయెను.

పిమ్మట హైమవతి యుషావతియొద్దకు వచ్చినిలువఁడియెను. హైమవతినిఁ జూచి యుషావతిగంభీరముఖకమలము



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPWA/02B186 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 153 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |